# కొత్తపల్లి-తెలుగు పిల్లల ఈ(e) మాసపత్రిక ఏప్రియల్ 2011

( **http://kottapalli.in/2011/04 కి అక్షర రూపం)**

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం:** వీరాంజనేయులు

**అక్షర కూర్పు:** కొత్తపల్లి ఆఫ్‌సెట్ ప్రెస్, చెన్నేకొత్తపల్లి.

ముద్రిత ప్రతి వెల:

**ప్రతి ఒక్కింటికి రూ. 20/-**

**పన్నెండు భాగాల ప్రత్యేక వెల: రూ. 240/-**

ఈ పుస్తకం పూర్తిగా ఓపెన్ సోర్సు ఉపకరణాలను ఉపయోగించి తయారు చేయబడింది.



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

**ఫోను: 08559 240222 ఇ-మెయిలు: team@kottapalli.in**




# విషయ సూచిక

# మూడో మెట్టు

తెల్లవారు జామున, తూరుపు ఆకాశం అప్పుడప్పుడే, అక్కడక్కడా ఎర్రబారుతున్న వేళ, పడమటి దిక్కున మెరుస్తున్న చందమామకు వేసిన నిచ్చెన ఒకటి కనబడింది, ఒక పిల్లవాడికి.

వాడు, వాళ్ళ చెల్లి, పోటీ పడ్డారు- "ఎవరు ముందు పైకెక్కాలి?" అని.

"ఇద్దరం కలిసి ఎక్కుదాం" అనుకునేసరికి రాజీ కుదిరింది.

మొదటి మెట్టు ఎక్కేసరికి చాలా సంతోషం వేసింది వాళ్ళిద్దరికీ. ఏమంటే, పొట్టిగా- రాజు అంత- ఉండే పిల్లలు, ఇప్పుడు సురేష్ అంత పెద్దగా అయ్యారు! కుండీల్లో ఏపుగా పెరిగిన మొక్కలు కూడా ఇప్పుడు వాళ్ళ కాళ్ళకంటే తక్కువ ఎత్తులో ఉన్నాయి! అట్లా మెట్టెక్కి చూస్తూంటే "మేం చాలా గొప్పవాళ్ళం!" అనిపించింది వాళ్ళకు. ఆ సంతోషంలో అటూ ఇటూ చూస్తూ మురిసిపోయారు.

వాళ్ళు రెండో మెట్టు ఎక్కేసరికి ఇంకొంచెం తెల్లవారింది- పొద్దు పొడుపులో చందమామ తెలవెలపోవటం మొదలుపెట్టాడు. మొదటి మెట్టు కంటే రెండోమెట్టు చాలా బాగుంది. "మేం చూడండి- ఎంత ఎత్తులో ఉన్నామో!" అరిచాడు పిల్లవాడు. "అప్పుడే రెండో మెట్టు ఎక్కేశాం!" ఉత్సాహపడింది చెల్లి. వాళ్ల అమ్మా-నాన్న, అక్కలు, అన్నలు వచ్చి చూశారు- చుట్టూ చేరారు. "బలే ఎక్కారు, ఇంకో మెట్టు ఎక్కండి, ఇంకా పైకి!" అన్నారు ప్రోత్సహిస్తూ.

అక్కడ నిలబడి చూస్తుంటే భలే ఉంది. పిల్లలిద్దరి కాళ్ళూ క్రింద నిలబడ్డ వాళ్ళ భుజాలంత ఎత్తులో ఉన్నై. వాళ్ళ తలలైతే పెద్దల్ని మించిపోయినై! "చూశావామ్మా, మేం ఎంత పెద్ద నిచ్చెన వేశామో, ఆకాశానికి!?" అన్నాడు పిల్లవాడు. "తప్పు నాన్నా! ఇది మీరు వేసిన నిచ్చెన కాదు. చందమామ తనంతట తాను, 'రండి, రండి- చేరుకోండి' అని ఏనాడో వేసిపెట్టిన నిచ్చెన అది. మీకంటే ముందు చాలామంది వెంకట్రావులూ, మంగాదేవులూ, శివరాములూ, బాపూ-రమణలూ, జేజిమామయ్యలూ, నామినులూ ఎక్కేశారు దాన్ని. ఇప్పుడు మీవంతు. ఇట్లా చెబుతున్నానని చిన్నబుచ్చుకోకండి- మీరు పైకి చూశారంటే దూరంగా ఎక్కడో వాళ్ళలో కొందరి పాదాలు కనబడతై, నిజంగానే. వీలైతే వెళ్ళి వాళ్లని పట్టుకొని నమస్కారాలు పెట్టుకోండి. ప్రయాణంలో వాళ్ళకి ఏమేం కనబడ్డాయో తెలుసుకోండి" చెప్పింది అమ్మ.

పిల్లలిద్దరూ పైకి చూస్తే నిజంగానే చాలా పాదాలు కనబడ్డాయి. "వీళ్ళంతా ఇంతసేపూ ఎందుకు కనబడలేదు?" ఆశ్చర్యపోయాడు పిల్లవాడు. "నీకే, కనబడనిది! నేనైతే వాళ్ళందర్నీ ముందే చూసేశాను" గర్వంగా చెప్పింది చెల్లి.

మెల్లిగా ఇద్దరూ మూడో మెట్టు ఎక్కారు. ఎక్కింది మూడు మెట్లే, ఇంకా నిచ్చెన చాలా చాలా ఎత్తుగా, అనంత ఆకాశంలోకి పోతున్నది. "నిజమే! ఈ దారంతా వేరేవాళ్ళు చాలా మంది తయారు చేసి పెట్టారు. ఇంత మంచి నిచ్చెనను మనంతట మనం వేయగలిగే వాళ్ళం కాదు" అన్నాడు పిల్లవాడు, పైకి చూస్తూ.

"ఇటు చూడు, ఎంతమంది పిల్లలు వచ్చారో!" అన్నది చెల్లి, చుట్టూ చూస్తూ. నిజంగానే నిచ్చెన చుట్టూ ఒక ఐదారు వందలమంది పిల్లలూ, వాళ్ల అమ్మా నాన్నలూ,

టీచర్లూ గుమిగూడి ఉన్నారు. అందరూ ఉత్సాహంగా చేతులు ఊపారు. "ఇంకా పైకి పోండి, పైకెక్కండి. ఏమైనా సాయం కావాలంటే అడగండి" అని అరిచారు.

"పైన ఎవరెవరో కనబడుతున్నారు గానీ, నిచ్చెనకు మొదట్లో ఎవరూ ఉన్నట్లు లేరు. మీరూ వచ్చెయ్యండి, మూడు మెట్లేగా!? త్వరత్వరగా వచ్చి చేరుకోవచ్చు- ఆపైన అందరంకలిసి ఎక్కుదాం!" అని క్రిందికి చేతులు చాపారు పిల్లలిద్దరూ.

చాలామంది పిల్లలు "మేం వస్తున్నాం, ఆగండి! మేమొస్తున్నాం!" అని అరుస్తూ గందరగోళంగా నిచ్చెనెక్కటం మొదలుపెట్టారు.

వాళ్ళందరి బరువునూమోస్తున్న నిచ్చెన సంతోషంగా ఊగింది. ముందే పైకెక్కేసినవాళ్ళు ఓసారి క్రిందికి చూసి నవ్వారు మురిపెంగా.

కొత్తపల్లి పత్రిక ఇప్పుడు నాలుగో సంవత్సరంలోకి అడుగు పెడుతోంది. మూడేళ్ళుగా దీన్ని ఆదరించి, ప్రోత్సహించి, వెంటనడుస్తున్నవాళ్లకూ, దారి చూపిస్తున్న పెద్దలకూ అందరికీ కృతజ్ఞతాభివందనాలు.

-కొత్తపల్లి బృందం.




# నీతి చంద్రిక

18 వ భాగం

*మూలం: కీ.శే. పరవస్తు చిన్నయ సూరి సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ.*

*కరటకుడు పింగళకుడికి 'నల్లి-పేను' కథ చెప్పి, ఎద్దును శిక్షించటమే మంచిదన్నది. అయినా సింహం అందుకు ఒప్పుకోక, క్షమాపణ కోరుకునేందుకు ఎద్దుకు ఒక అవకాశం ఇవ్వాల్సిందే అని నిర్ణయించింది. ఆ మాటను ఎద్దు దగ్గరికి మోసుకెళ్ళింది, దమనకం- ఇక చదవండి, నీతిచంద్రిక-18 వ భాగం...*

అప్పుడు దమనకుడు సంజీవకునితో "ఏమీ తెలియని వాడి లాగా మాట్లాడుతున్నావు. కాటకపాటకులు 'రాజద్రోహులు' అని తెలిసీ వాళ్ళతో స్నేహం చేస్తున్నావే!? రాజుగారికే కాదు; ఎవ్వరికైనా ఇది 'తప్పు' అని అనిపించకుండా ఉంటుందా? నువ్వు చేస్తున్న ఈ పని తెలుసుకొని, రాజుగారు ఎక్కడలేని కోపంతో మండి పడుతున్నారు. గతంలో నువ్వు నా మాటకొద్దీ రాజుగారి పంచన

చేరావు: కాబట్టి ఉన్న మాట చెబుతాను, విను. 'సంజీవకుడి పక్షాన చేరిన వాళ్ళు ఎవరు ఎదురుపడ్డా వాళ్ళను ఆ క్షణంలోనే యమపురికి పంపిస్తాను' అని సింహరాజు పరమ గంభీరంగా ప్రతిజ్ఞ చేశాడు. 'ఇప్పటికిప్పుడే సంజీవకుడిని వెంటబెట్టుకు రా!' అని నన్ను పంపాడు. ఆపైన నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి-"



"ఇంతటి చెడు ఊరికే పుట్టదు- దగ్గర చేరినవాళ్ళే ఎవరో నీపైన చాడీలు చెప్పి ఉంటారు. ఇంకా ఇలాంటివి ఏమేమి పుట్టనున్నాయో తెలియదు. ఇవాళ్ల నీకైంది, రేపు మాకు కావచ్చు! జరిగినదానికి విచారపడి ఫలితం ఏమున్నది? ఏనాడైతే రాజుగారిని సేవించేందుకు బానిస మాదిరి ఒప్పుకున్నామో, ఆనాడే మనం అందరం మృత్యువు నోట్లో పడ్డాం. అందువల్ల దేన్నీ తలచుకొని ఏడవకూడదు. అది 'సముద్రాన్ని దాటేశాక వంతెన కట్టటం' అవుతుంది తప్ప, తెలివైన పని కాదు" అని నిట్టూర్చి, దు:ఖాన్నీ, బాధనీ అభినయిస్తూ, తలవంచుకొని క్రిందివైపుకు చూస్తూ, ఊరుకున్నది.

వజ్రాయుధం కొండను ఛేదించినట్లు, దమనకుడి ఆ మాటలు సంజీవకుడి ధైర్యాన్ని బ్రద్దలు చేశాయి. భయం క్రమ్ముకొనగా, అది కొంత సేపు నిశ్చేష్టమై ఉండిపోయింది. చివరికి అది మనసును గట్టి చేసుకొని, దమనకుడిని చూస్తూ "ప్రతి క్షణమూ రాజుగారి మేలునే కోరాను తప్పిస్తే,

కీడును కలనైనా తలపలేదే? శత్రువులకైనా కీడు తలపెట్టాలని నా మనస్సు కోరుకుంటుందా? కారణం ఏమీ లేకుండానే ప్రభువుకు ఇలాంటి పంతపు కోపం తెప్పించి, మంచివాళ్లను చెరిపేందుకు ఒడికట్టిన ఆ పుణ్యాత్ములు ఎవరోగాని, వాళ్లు బ్రహ్మకల్పం ముగిసేంతవరకూ నిలచి ఉంటారు కాబోలు! పాములకు విషం సహజం- అదే విధంగా దుర్మార్గులకు చెడు బుద్ధి సహజం. అసలు వాళ్ళను ఏమనాలి, రాజుగారి అవివేకమే అన్ని అనర్థాలకూ మూలం. 'ఎద్దు ఈనింది' అనగానే 'కొట్టంలో కట్టెయ్' అనేవాడు రాజైతే ఏముంది? ఇక సేవకులు భయం వదిలి పెడతారు; తమ ఇష్టం వచ్చినట్లు ప్రభువును అకార్యాలకు ప్రేరేపించి, కీర్తి ప్రతిష్ఠలు నాశనం చేస్తారు; చివరికి మంచితనం అనేదే మిగలకుండా చేస్తారు.



ఇంతకాలమూ రాజుగారి అనుగ్రహం సంపాదించేందుకు నేను పడిన పాట్లన్నీ వృధా అయ్యాయి. వివేకం లేని యజమానిని సేవించటం కేవలం వృధా మాత్రమే కాదు- ప్రాణాంతకం కూడా అవుతుంది.

నా మనస్సులోగాని, మాటలోగాని, చేతల్లోగాని, ఏ నాడూ ఏ చిన్న తప్పూ చేసి ఎరుగను. అనుక్షణం ప్రభువు క్షేమాన్నే కోరుకున్నాను. అలాంటి నేను ఇప్పుడు 'మృత్యువు నోరు' అనే గుహలోకి దూరవలసి వస్తున్నది గదా!

చూడు, 'ఇతరులకు నేను ఏ కొంచెం చెడూ చేయలేదు; కనుక నాకు వేరెవరు కీడు తలపెడతారు?' అనుకోకూడదు. కోరికతోటీ ద్వేషంతోటీ కుళ్ళిపోయినవారి మనస్సులు మంచివారి మీద కూడా విషాన్నే క్రక్కుతాయి. ఇదివరకు కాకి, పులి, నక్క కలిసి, తమ ప్రభువైన సింహాన్ని ప్రేరేపించి, పరమ సాధువైన ఒంటెనుకూడా కపటోపాయంతో చంపించలేదా?" అన్నది.

"ఏమాకథ, వివరంగా చెప్పు" అని దమనకం అడిగితే సంజీవకం ఆ కథను చెప్పసాగింది-

**సింహం-ఒంటె కథ**

మలయ పర్వతాల దగ్గర, 'దర్పసారం' అనే సింహం ఒకటి ఉండేది. ఒక కాకి, ఒక పులి, ఒక నక్క దానికి మంత్రులు. ఒకసారి ఆ మంత్రులు మూడూ అడవిలో తిరుగుతూండగా వాటికి ఒక ఒంటె కనబడ్డది. అవి దాని దగ్గరికి పోయి "నువ్వెవ్వరు? ఎక్కడినుండి వచ్చావు? నీ పేరేమిటి?" అని అడిగాయి.



అప్పుడు ఆ ఒంటె వాటికి తన కథను చెప్పుకున్నది- "వర్తకుడొకడు నామీద ఎప్పుడూ ఎక్కడలేని బరువునూ ఎక్కించి మోయిస్తుండేవాడు. ఇట్లా చాలా కాలం పాటు అతనికి ఊడిగం చేశాను గానీ, ఆ బాధను ఇక భరించలేకపోయాను. ఒక రోజున అతన్ని ఏమార్చి, ఇదిగో- ఇట్లా ఈ అడవిలోకి వచ్చి, దాక్కున్నాను. ఈ పులి రాజును చూస్తే లోక భీకరుడిగా కనబడుతున్నాడు. ఇక మీరేమో, గొప్ప

విజ్ఞానులుగా తోస్తున్నారు. ఎలాగో ఒకలాగ మీ అనుగ్రహం పొందానంటే, నా భయం పోగొట్టుకొని బ్రతుక్కుంటాను. మీరు తప్ప నాకు వేరే గతి లేదు. 'శరణు జొచ్చినవాళ్ళను కాపాడటం అన్ని ధర్మాలలోకీ గొప్పది' అని ధర్మశాస్త్రం తెలిసినవాళ్ళు చెబుతుంటారు. నన్ను కాపాడండి" అన్నది అది.

అప్పుడు ఆ నక్క దానితో "ఈ అరణ్యంలో ఒక గొప్ప మృగరాజు ఉన్నాడు. శత్రువుల శౌర్యం అనే దీపాన్ని తుపుక్కున ఆర్పే సుడిగాలి లాంటి మహాబలుడు, అయన. మేము ఆ సింహరాజు సేవకులం మాత్రమే. నువ్వు ఆయన్ని తప్పక దర్శించాలి. నీకు మావల్ల అయ్యే మేలు మేము చేస్తాము. అంతా మేలే జరుగుతుందిలే; భయపడకు- మావెంట రా!" అని దాన్ని వెంటపెట్టుకొని సింహం దగ్గరికి తీసుకెళ్ళాయి. ఆ ఒంటెకు వాటి మాటలు విని ధైర్యం వచ్చింది. మనస్సులో పొంగిపోతూ వాటి వెంట నడిచి పోయింది.



అప్పుడా కాకి, నక్క, పులి సింహరాజు దగ్గరికి వెళ్ళి, దాని ముందు నిలబడి, ఒంటె కథను తాము విన్నది విన్నట్లుగా చెప్పాయి. అటుపైన ఒంటెను ముందుకు నెట్టి సింహరాజుకు మ్రొక్కమన్నాయి. ఆ ఒంటె వినయంగా సింహ రాజుకు నమస్కరించి ఒక ప్రక్కగా నిలబడింది. సింహం దాన్ని దయతో చూసి, దానికి అభయం ఇచ్చి, కొంచెంసేపు ఆ సంగతీ ఈ సంగతీ మాట్లాడి- "నీకు మంత్రి పదవిని ఇస్తున్నాం. మా పాత

మంత్రులతో కలిసి నువ్వు కూడా రాచ-కార్యాలను నెరపుతూ సుఖంగా ఉండు" అన్నది. "మహా ప్రసాదం" అని ఊపిరి పీల్చుకున్న ఒంటె ఆనాటినుండీ అణకువతో సింహరాజు చెప్పిన పనులన్నీ చేస్తూ ఉన్నది.

ఇట్లా చాలాకాలం గడిచింది. ఒకరోజున సింహం తన మంత్రులను పిలిచి "మంత్రులారా! నా శరీరం ఇప్పుడు వ్యాధి పీడితమైంది. నా ఒంట్లో ఇదివరకటంత సత్తువ ఉండటం లేదు- ఇప్పుడు అడవిలో తిరగలేను. నా ఆరోగ్యం బాగై, శరీరంలోకి కొంత శక్తి వచ్చి చేరేంతవరకూ నాకు మీరే ఆహారం సంపాదించి తెచ్చి ఇవ్వాలి" అన్నది.

అది విని మంత్రులన్నీ "ప్రభూ! మేం చిన్నవాళ్ళం. బలహీనులం. మీకు ఒక్క పూటకు సరిపోయేంత ఆహారాన్ని కూడా తెచ్చి ఇచ్చేంత సమర్థత లేదు, మాకు! ఏదో, మీ పాదాల చెంతన పడి ఉండి, మీరు తినగా మిగిలిన దాన్ని తింటూ బ్రతుకుతున్నవాళ్ళం. మా శక్తి ఎంత పరిమితమైనదో దేవరవారికి తెలీనిది కాదు" అన్నాయి.



అప్పుడా సింహం వాటిని చూసి "దొరికినంతనే కానివ్వండి- కొంచెంతోటే సర్దుకుంటాను! అదికాక ఇప్పుడు నేనేం చేసేది? గతంలో చేసిన పనుల వల్ల నాకు ఇప్పుడు ఈ వ్యాధి ఒకటి, దాపురించింది. నడిచేందుకు ఏ కొంచెం శక్తి ఉన్నా మిమ్మల్ని కష్టపెట్టేవాడిని కాదు. అందువల్ల, భయపడకండి- అడవిలోకి వెళ్ళి, ఏలాంటి

మాంసం అయినా పరవాలేదు- ఎంత దొరికితే అంత- తీసుకొని రండి. పోండి!" అని ఆజ్ఞాపించింది.

ఆ నాలుగు జంతువులూ సింహానికి ఎదురు చెప్పేంత ధైర్యం లేక, అడవిలోకి పోయి, అన్ని వైపులా వెతకటం మొదలు-పెట్టాయి. అయినా వాటికి సరైన ఆహారం ఏదీ దొరకనే లేదు. మధ్యాహ్నం అవుతుండే సరికి వాటి బాధ మరింత ఎక్కువైంది. నాలుగూ వేటికవి, వేరు వేరు దిక్కుల్లో పోయి, మాంసం కోసం వెతికాయి. అట్లా వెతుకుతూ వెతుకుతూ చివరికి కాకి, పులి, నక్క మాత్రం ఒక చోట కలుసు-కున్నాయి. చూడగా ఆ మూడింటిలో దేని దగ్గరా ఒక్క మాంసపు ముక్క కూడా లేదు!

అప్పుడు కాకి మిగిలిన రెండింటితో అన్నది- "మీరు ఏ కొంచెం మాంసాన్ని కూడా సేకరించినట్లు అనిపించటం లేదు. మీ అంతటి వాళ్ల చేత కాని పని, అల్పజీవిని-పక్షిని- నాకు ఎట్లా సాధ్యం? మధ్యాహ్నం అయ్యింది- ఇంకా తిరిగితే దానివల్ల పనికిమాలిన ఆయాసమే తప్ప, ప్రయోజనం ఏమాత్రం ఉండేటట్లు లేదు. మృగరాజు మన రాక కోసం ఎదురు చూస్తూ ఉంటాడు. ఆయన దగ్గరికి ఉత్త చేతులతో వెళ్ళటం కుదరదు-

ఇంతకాలమూ మనం ఆయన తెచ్చి ఇచ్చిన మాంసాన్ని పొట్టనిండా తిని, కాలు బయట పెట్టకుండా నిశ్చింతగా బ్రతికాం. ఆయనకు ఇప్పుడొక కష్టం వస్తే, ఒక్క పూటకు సరిపడేంత భోజనం అయినా తెచ్చి ఇవ్వలేని మనలాంటి సేవకులు ఎందుకు?" ఇప్పుడు నా మనస్సుకు ఒకే మార్గం కనబడుతున్నది- దాన్ని విని, మీకు తోచిన విధంగా చేయండి-" అన్నది వాటితో.

ఆపైన అది నలువైపులా కలయజూసి, మిగిలిన వాటికి దగ్గరగా జరిగి, గొంతు తగ్గించి, మెల్లగా "మనం ఈ ఒంటెను

సరిపెట్టి- ఇవాళ్టికి ఎలాగో ఒకలాగ రాజుగారి పనిని నెరవేర్చామంటే, రేపటి సంగతి రేపు చూసుకోవచ్చు. రాజుగారు తిని వదిలిపెట్టిన మాంసాన్ని మనం మరికొన్ని రోజులపాటు కడుపారా తినచ్చు కూడాను- ఆలోచించండి" అన్నది.

"మన రాజుగారు ఆ ఒంటెకు మంత్రి పదవిని ఇచ్చి చాలా గౌరవిస్తూ వస్తున్నాడు. అందువల్ల అంత త్వరగా దాన్ని చంపి తినడు. మనకై మనం అట్లాంటి పని ఏమైనా చేశామంటే ఆయన మనసుకు నొప్పి కలుగుతుంది- మనమే ఆయనకు దూరం అయిపోతాం. అందువల్ల నువ్వు చెప్పిన మార్గం మనకు సరిపోదు" అన్నది నక్క.

"ఆకలిగొన్నవాడికి తను చేసే పనుల్లో మంచి-చెడులేవీ పట్టవు. సొంతవాళ్లని చంపేందుకైనా పాల్పడతాడు గానీ, 'ఇది తప్పు పని కదా' అనుకోడు. ఆకలి బాధ వల్ల కాకపోతే- పాము తన గ్రుడ్లను, ఆడపులి తన పిల్లలను- ఎందుకు తింటాయి?" అన్నది కాకి మళ్ళీ అందుకొని.

అది విని పులి ఇట్లా అన్నది- "మన రాజుగారు ఆకలికి తట్టుకోలేక ఒంటెను చంపితే చంపనివ్వండి- దాంతో మనకు సంబంధం లేదు. మనం ఆయన దగ్గరికి వెళ్ళి, భయపడకుండా, మనం పడిన కష్టాలన్నీ వివరిద్దాం. 'అటుపైన ఏం చేయాలి' అనేది మనమూ, ఆయనా- కలిసి ఆలోచిద్దాం" అన్నది.

"సరే" అన్నాయి మిగిలిన రెండూ. అప్పుడు, ఒంటె ఇంకా తిరిగి రాకనే ఈ మూడూ వెళ్ళి, సింహం ముందు నిలబడ్డాయి.

"ప్రభూ! ఏం చెయ్యాలి? తిరగరాని చోట్లన్నిటా తిరిగాం; పడరాని పాట్లన్నీ పడ్డాం. ఇంత శ్రమ పడీ ఏం ప్రయోజనం? ఎంతో కరుణతో- మా రక్షణను, పోషణను

సొంత పనుల మాదిరి బాధ్యతతో నిర్వర్తించే మా ప్రభువులవారికి- మా వల్ల ఆవగింజంత ఉపయోగమూ కలగలేదు! అయినా మా విన్నపం ఒకటి- కాదనకుండా వినండి. ప్రభువులవారు ఆకలి బాధ వల్ల చాలా డస్సిపోయి ఉన్నారు. మాలో ఒకడిని తిని, మీ ఆకలిని తీర్చుకోండి! మా యీ ప్రార్థనను మన్నించండి!" అన్నాయి.

(మిగతాది మళ్ళీ వచ్చేసారి...)

**ఎంతిచ్చినా సరే!**

నందన : బేరమాడకుండా తీసుకునే దేవిట్రా?

మారుతి : అప్పు !

*సేకరణ: B. దివ్య*





# దురాశ

*సేకరణ: డి.చంద్రమోహన్, మక్కినవారిపల్లి, రామగిరి.*

*సౌజన్యం: "చిన్నారి నేస్తం"*

అనగా అనగా చంద్రపురం అనే గ్రామం ఉండేది. ఆ గ్రామం ప్రక్కన ఒక అడవిలో పెద్ద పెద్ద కొమ్మలు, ఊడలతో విశాలంగా విస్తరించిన ఓ మర్రిచెట్టు ఉండేది. ఆ చెట్టు క్రింద పెద్ద పుట్టలో ఓ నాగుపాము నివసిస్తుండేది.

ఒక రోజు సూరయ్య అనే కట్టెలు కొట్టుకొని జీవించే కూలివాడు గొడ్డలితో వచ్చి ఆ మర్రిచెట్టును కొట్టనారంభించాడు. ఇంతలో పుట్టలో నుండి ఒక నాగుపాము బయటకు వచ్చి- "ఓసూరయ్యా! ఈ చెట్టును కొట్టకు. ఇది మా ఇంటి చెట్టు, దీనిని ఆశ్రయించుకొని నేను, అనేక రకాల పక్షులు చాలా సంవత్సరాలుగా సుఖంగా

జీవిస్తున్నాం. దీనికి ప్రతిఫలంగా నేను నీకో మణిని ఇస్తాను. తీసుకొని వెళ్ళి హాయిగా జీవించు" అన్నది.

సూరయ్య చాలా సంతోష పడ్డాడు. చెట్టును కొట్టడం మాని, ఆ మణిని తీసుకొని వచ్చాడు. మణిని అమ్మేసరికి సూరయ్యకు ఎక్కడలేని వసతులూ సవకూరాయి. అతనిప్పుడు గొప్ప ధనవంతుడు. అయితేనేమి? కూర్చొని తింటే కొండలైనా కరిగిపోతాయి. సూరయ్య చేతిలో డబ్బంతా కొన్నాళ్లకు ఖర్చయిపోయింది. మళ్ళీ కట్టెలు కొట్టుకుంటూ అదే చెట్టు దగ్గరికి వెళ్ళాడు.

పాము మళ్ళీ బయటకు వచ్చి, సూరయ్యను పలకరించింది- "ఏం సూరయ్యా! మళ్ళీ వచ్చావా!? ఎందుకు?! నువ్విక్కడికి రావద్దని అప్పుడే నీకో మణినిచ్చానుగా?" అన్నది.

"నువ్విచ్చిన మణి ఎన్ని రోజులు ఉంటుంది, వెంటనే అయిపోయింది! ఇల్లుగడవాలి గదా, కట్టెలు కొట్టకపోతే ఎలాగ?" అన్నాడు సూరయ్య, గొడ్డలికి పదును పెడుతూ.

"ఆగాగు! నీకు ఈసారి రెండు మణులిస్తాను. వాటితో నువ్వు జీవితాంతం సంతోషంగా బ్రతికేయచ్చు" అని, పాము లోపలికి వెళ్ళి, ఈసారి రెండు మణుల్ని తెచ్చి సూరయ్యకిచ్చింది.

సూరయ్య సంతోషంగా ఆ మణుల్ని తీసుకొనివచ్చి, మరికొంతకాలం ఎలాంటి చీకూ చింతా లేకుండా హాయిగా బ్రతికాడు. ఆ తరువాత అతనిలో దురాలోచన మొదలైంది. "ఆ పుట్టలో ఎన్ని మణులుండచ్చు?" అని. "పామును చంపేసి, మణులన్నిటినీ ఒకేసారి తెచ్చుకుంటే జీవితాంతం రాజాలాగా బ్రతకచ్చు కదా!" అనుకున్నాడు అతను.

వెంటనే అతను ఇద్దరు మనుషులను

వెంటబెట్టుకొని వచ్చి, గడ్డపారలతో పుట్టనంతా త్రవ్వాడు. అడ్డం వచ్చిన పామును చంపేసి పుట్టనంతా వెతికాడు. కానీ పుట్టలో ఒక్క మణి కూడా లేదు!

సూరయ్యకు, ఏడుపొచ్చింది- "అయ్యో! మణులనిచ్చి ఆదుకునే నాగ దేవతను చేతులారా చంపుకున్నానే! దురాశ ఎంతపని చేసింది!" అని ఏడుస్తూ వెళ్ళిపోయాడు.



రెండు కొండలు!

" మీ ఇంటి పేరేమిటండీ?" అని అడిగాడు అబ్బాయి తండ్రి.

" చీమల కొండ" అని సమాధామిచ్చాడు అమ్మాయి తండ్రి.

" అయితే మీతో మాకు సంబంధం కుదరదు- మా ఇంటి పేరు బెల్లం కొండ!" నిక్కచ్చిగా చెప్పాడు అబ్బాయి తండ్రి.

*G. సుచరిత*



# ఆడపిల్ల కథ

*రచన: యస్, మమత, 10 వతరగతి, వెంకటాపురం.*

అనగనగా ఒక ఊరు ఉండేది. ఆ ఊర్లో చాలా పేదరికం ఉండేది. అక్కడ ఒక కుటుంబంలోని వాళ్ళకు ఆరుగురు పిల్లలు- అందులో ఒక మగ పిల్లవాడు ఉండేవాడు. మిగిలిన ఐదుగురూ ఆడపిల్లలే. వాళ్ల అమ్మనాన్నలు ఐదుగురు ఆడపిల్లల్నీ చదవనిచ్చేవాళ్ళు కారు- మగ పిల్లవాడిని మాత్రం బడికి పంపి చదివించేవాళ్ళు. ఆడపిల్లలను ఇంట్లో పనికి, చేన్లో పనికి ఉపయోగించుకొనేవారు. అంత చేసినా వాళ్ళకు సరిగా అన్నం పెట్టేవాళ్ళు కాదు- మగవాళ్ళు తిన్నాకనే ఆడపిల్లలకు పెట్టేవాళ్ళు.

కొద్ది రోజుల తర్వాత ఆడపిల్లల్ని

ఐదుగురినీ అలాగే వదిలేసి అమ్మా-నాన్న ఎక్కడికో వెళ్ళిపోయారు. మగ పిల్లవాడిని మాత్రం అదే ఊళ్ళో హాస్టల్లో చేర్పించారు.



ఆడపిల్లలు ఐదుగురూ తోచిన పనులు చేసుకుంటూ కాలం గడిపారు. వాళ్ళలో ఇద్దరు ఆడపిల్లలు, చిన్నవాళ్ళు- "మనం మాత్రం ఎందుకు చదవకూడదు" అని, వాళ్ళు కొందరితో పుస్తకాలు తెప్పించుకొని చదివారు. బడికి కూడా వెళ్ళలేదు- ఇంట్లోనే చదువుకుంటూ, కూలిపని చేసుకుంటూ తమ చదువును కూడా కొనసాగించారు.

కొన్ని నెలలకు వాళ్ళ అమ్మానాన్నలు తిరిగి వచ్చారు. ఆడపిల్లలు అందరినీ 'ఏమేం చేస్తున్నారు?' అని అడిగారు. "మీరు చెప్పినట్లుగానే పనులకు వెళ్తున్నాం" అని చెప్పారు అందరూ. చిన్నవాళ్ళు ఇద్దరూ తాము చదువుకుంటున్న సంగతి చెప్పలేదు- చెబితే తిడతారని. "అయితే మీరు సంపాదించిన డబ్బులు ఇటు ఇవ్వండి" అని అడిగారు వాళ్ళ అమ్మా, నాన్న. అందరూ తాము సంపాదించిన డబ్బుల్ని కలిపేసి తెచ్చి ఇచ్చారు. వాళ్ళ అమ్మ ఆ డబ్బుల్ని చూసి "ఇంతేనా" అని ఐదుగురినీ తిట్టింది, కొట్టింది. కానీ వాళ్ళు మాత్రం "చెల్లెళ్ళు చదువుకుంటున్నారు" అని చెప్పలేదు. అమ్మానాన్నలు వెంటనే వెళ్ళి హాస్టలులో ఉన్న కొడుకుని ఇంటికి పిలిపించారు- వాడికి కొత్తబట్టలు అవీ తెచ్చి ఇచ్చారు. అప్పటినుండి ప్రతినెలా వాడికి

ఒక కొత్త వస్తువు కొనిపెట్టారు.

ఆ పిల్లవాడు హాస్టలులో ఉండి చదువుకోకుండా అల్లరిపనులు చేస్తున్నాడు- కానీ వాడు ఏమి చేసినా ఇంట్లోవాళ్ళు వాడిని ఏమీ అనలేదు. కానీ ఆడపిల్లలని మాత్రం ఏమీ చేయకుండానే తిడుతుండేవాళ్ళు. ఆలోగా పదోతరగతి పరీక్షలు వచ్చాయి. అక్కలంతా కలిసి ఇచ్చిన డబ్బులతో పరీక్ష ఫీజులు కట్టారు, ఆడపిల్లలిద్దరూ. పక్కవాళ్ళింట్లో టివి చూడటానికి పోయినట్లు పోయి, చదువుకునేవాళ్ళు రాత్రిపూట. అలా చాలా కష్టపడి ఎలాగో ఒకలాగ పరీక్షలు రాసారు.

ఫలితాలు వచ్చాక చూస్తే, వాళ్ళిద్దరికీ జిల్లా మొత్తంలోకే మొదటి ర్యాంకులు వచ్చాయి! అందరూ ఆ సంగతే చెప్పుకుంటుంటే అమ్మానాన్నలకు తెలిసింది: "మేం పనికి పొమ్మంటే మీరు చదువుకున్నారా" అని వాళ్ళు ఆ పిల్లలిద్దరినీ తిట్టారు; కొట్టారు; చంపేసేందుకు పూనుకున్నారు.



ఇరుగు పొరుగు ఇళ్ళవాళ్ళు వచ్చి పిల్లల్ని కాపాడితే వాళ్ళనూ కసురుకున్నారు. అంతలో వాళ్ళ కొడుకు వచ్చాడు-ఏడుపు ముఖంతో, పేపరు పట్టుకొని- వాడు పరీక్షలో ఫెయిలయినాడట! అంతలో అటువైపు వచ్చిన వాళ్ళ సారు "వీడు ఎప్పుడో తప్పాల్సింది- చాలా అతి చేస్తున్నాడు బడిలోనూ, హాస్టలులోనూ. మీకు ఎన్నిసార్లు చెప్పినా మీరూ పట్టించుకోలేదు.

అందుకే ఈపరిస్థితి. ఇప్పుడు వాడిని ఏదోఒక పనిలో పెట్టాల్సిందే!" అన్నారు. ఆడపిల్లల్నిద్దరినీ ఆయన దగ్గరికి తీసుకొని, చాలా మెచ్చుకున్నాడు- "మీరు ఇంకా బాగా చదవండమ్మా! మీ చదువులకయ్యే ఖర్చుని నేను భరిస్తాను- మీ తల్లిదండ్రులకు ఎలాగూ బుద్ధిలేదు" అన్నారు సారు. ఆయన మాటలు విన్నాక వాళ్ళ అమ్మానాన్నల కళ్ళు తెరుచుకున్నాయి. ఆనాటినుండీ తమ పిల్లల్ని అందరినీ సమానంగా చూసుకున్నారు.



**అంతా మాయే!**

గంగ: మా ఆయన మెజీషియన్ అవడం వల్ల పెద్ద ఇబ్బందిగా ఉందే!

లింగమ్మ: ఎందుకు?

గంగ: అడిగినవన్నీ క్షణంలో సృష్టించి ఇస్తాడు, ఆయనటు వెళ్లగానే అన్నీ మాయమైపోతాయి.

*సేకరణ: B. దివ్య*



# తెలివైన కుందేలు

యోగి కథ-3

*సమస్యకు భయపడకూడదట. దానికి సరైన ముగింపు ఇవ్వాలట! చదివి చెప్పండి, మరి!*

*రచన:* E.*యోగేశ్వర రెడ్డి* VII Rose, *అరవింద హైస్కూల్, కుంచనపల్లి, విజయవాడ*-77

ఒక అడవిలో ఒక కుందేలు నివసిస్తూ ఉండేది. అదే అడవిలో క సింహం కూడా నివసించేది. ఆ సింహం చాలా చెడ్డది. అది రోజుకి మూడు జింకలనూ, ఒక కుందేలు గుంపునూ తినేస్తూ వచ్చింది. దానికి భయపడి అనేక జంతువులు అడవిని విడిచిపెట్టి పారిపోయాయి. అలా అడవిలోని జంతువులు చాలా తగ్గి పోయాయి.

కుందేలుకి ఈ విషయం తెలిసి ఒక ఉపాయం ఆలోచించింది. వెంటనే సింహం ఉన్న గుహకు వెళ్ళి, ఆ గుహముందే ఆడుకోవటం మొదలుపెట్టింది.

సింహానికి కుందేలును చూడగానే

నోట్లో నీళ్ళూరాయి. కుందేలు దగ్గరికి మెల్ల మెల్లగా నడవటం మొదలుపెట్టింది.

కుందేలు సింహం రాకను గమనించి అటువైపు తిరిగింది- "సింహంగారూ! ఇప్పుడు మీరు నన్ను చంపుతారని నాకు తెలుసు. కానీ మీరు కూడా ఎప్పుడో ఒకప్పుడు చావటం ఖాయం- మిమ్మల్ని చాలా జంతువులు చంపగలవు- ఏనుగు చంపగలదు; దున్నపోతు చంపగలదు; అలా కాకపోతే మీరు మనిషి చేతుల్లోనే పడచ్చు- వాళ్ళు మిమ్మల్ని ఈ అడవినుండి బందీగా తీసుకెళ్ళి ఏ జూలో పెట్టి మేపటమో, లేకపోతే ఏ సర్కస్‌లోలోనో పెట్టి, హింసించి ఆటలాడించటమో చేస్తారు! ఏదో ఒకలాగా మీరూ కష్టపడి చావాల్సిందే!" అన్నది.

"ఓసోస్! ఆ ఆపదలన్నీ వచ్చినప్పుడు చూసుకుందాంలే. ఈరోజున మాత్రం నేను నిన్ను తినటం ఖాయం" అని సింహం గర్జించింది.

కుందేలు ఏమీ భయపడలేదు- "సరే, సింహం! నువ్వు ఇప్పుడు నన్ను చంపు. భవిష్యత్తులో నేను సింహంగానూ, నువ్వు కుందేలుగానూ పుడతాం గదా, అప్పుడు నా పగ నేను తీర్చుకుంటాను!" అని తనే సింహాన్ని భయపెట్టింది.

సింహం కొద్దిగా వెనకంజ వేసింది- వెంటనే ఆ కుందేలు "చంపూ! నన్ను చంపూ!" అని దాని మీదికే వెళ్ళటం మొదలు పెట్టింది. ఆరోజున అక్కడినుండి పారిపోయిన సింహం మళ్ళీ ఆ అడవికి తిరిగి రాలేదు!

అడవిని వదిలిపెట్టి పోయిన జంతువులన్నీ మెల్లగా తిరిగి వచ్చాయి. సింహాన్ని పారద్రోలినందుకు కుందేలుకు కృతజ్ఞతలు చెప్పాయి.



# గెలుపెవరిది?

*రచన: T.కృష్ణకుమారి, 9 వ తరగతి, ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాల, దిగ్వాల్.*

*సౌజన్యం: జహీరాబాద్ కథలు, మనలైబ్రరి, జహీరాబాద్.*

అవంతీ రాజ్యాన్ని విక్రమదేవ వర్మ అనే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. చుట్టూ బలమైన శత్రుదేశాలు ఉన్నప్పటికీ, మంచి సైనిక శక్తి, తగిన సైన్యాధ్యక్షుడు ఉండటంతో ప్రజల్లోఅభద్రతా భావం లేకుండా ఉండేది.

అయితే అకస్మాత్తుగా సైన్యాధ్యక్షుడు మరణించాడు; వెనువెంటనే పొరుగు దేశాలు కయ్యానికి కాలు దువ్వే పరిస్థితి వచ్చింది. వెంటనే సమర్థుడైన సైన్యాధ్యక్షుడిని ఎన్నుకోవాలి- అందుకని రాజుగారు మంత్రి సుబుద్ధి సూచన మేరకు దండోరా వేయించాడు. రాజ్యంలోని

యువకులు వేలాదిగా వచ్చి తమ విద్యా పాటవాలను ప్రదర్శించారు. అందరిలోనూ సమఉజ్జీలుగా నిలిచిన రాజేంద్రుడు, అమరేంద్రుడు అనే ఇద్దరు యువకులను సుబుద్ధి తుది పరీక్షకు ఎంపిక చేసాడు. మరుసటిరోజే తుది పరీక్ష.

మైదానంలో పెద్ద వేదికను తయారు చేశారు. ప్రజలందరూ వచ్చి చేరారు. మంత్రి సుబుద్ధి వచ్చి చివరి పరీక్ష నియమాలను వివరించాడు: ముందు ఇద్దరి కళ్ళకూ గంతలు కట్టి ఉంచుతారు. ఇద్దరికీ చెరొక విల్లు, మూడు బాణాలు ఇస్తారు. దూరంగా ఒక పెద్ద గంటను పెడతారు. ఒక సైనికుడు వచ్చి గంటను మ్రోగిస్తాడు. ఇద్దరూ చెరో మూడు బాణాలతో ఆ గంటను కొట్టాలి. ఎవరి మూడు బాణాలూ ఖచ్చితంగా గంటకు తగుల్తాయో, వాళ్ళకే సైన్యాధ్యక్ష పదవి లభిస్తుంది. దీనికి ఒప్పుకొన్నారు ఇద్దరూ. పరీక్షకు సన్నద్ధులై నిలబడ్డారు.

ముందుగా రాజేంద్రుడు వచ్చి నిల్చున్నాడు. గంట మ్రోగగానే మూడు బాణాలనూ వరసగా వదిలాడు. ఆశ్చర్యం, ఆ మూడు బాణాలూ వెళ్ళి, ఒకదాని తర్వాత ఒకటి లక్ష్యానికి తగిలాయి! గంట మూడు సార్లు గణగణలాడింది! ప్రజలందరూ హర్షధ్వానాలు చేశారు. రాజేంద్రుడికే ఆ పదవి లభిస్తుందని చెప్పుకోసాగారు.



తరువాత అమరేంద్రుడు ముందుకు వచ్చాడు. మొదటి బాణం వెళ్ళి సూటిగా

గంటకు తగిలింది. రెండవసారీ గురి తప్పలేదు. దీంతో ప్రజల్లో ఉత్కంఠ పెరిగింది- అంతలో అమరేంద్రుడు వదిలిన మూడవబాణం దారి తప్పింది! అది సూటిగా రాజుగారు కూర్చున్న చెట్టువైపుకే వెళ్ళింది! ప్రజలకు ఏం జరుగుతోందో అర్థం కాలేదు. అందరూ ఒక్కపెట్టున అరిచారు.

అమరేంద్రుడు వదిలిన మూడవ బాణం రాజుగారి తలమీదుగా పోయి, ఆయన వెనక ఉన్న చెట్టు మొదలుకు గుచ్చుకున్నది. అటువైపుకు పరుగెత్తిన భటుడొకడు ఆ బాణాన్నీ, దానికి గుచ్చుకొని ఉన్న త్రాచుపామునీ తీసుకొని వచ్చి రాజుగారి చేతిలో పెట్టాడు, "గొప్ప ప్రమాదమే తప్పింది మహారాజా!" అంటూ.

'మూడు బాణాలనూ సరిగా వదిలిన రాజేంద్రుడిదే గెలుపు' అనుకున్నారు దూరంగా ఉన్న ప్రజలందరూ. రాజుగారు మాత్రం ఆశ్చర్యపోయారు- అమరేంద్రుడిని దగ్గరకు రావించి, అతని కళ్ళకున్న పట్టీలు విప్పించి, "అపాయాన్ని ఎట్లా కనిపెట్టావు?" అని అడిగాడు.

"మహారాజా! నేను మూడో బాణాన్ని వదిలేటప్పుడు మీ వెనకనున్న చెట్టు కొమ్మల్లోంచి ''బుస్!బుస్!" అని చప్పుడొచ్చింది. "అది పాము!" అని నాకు అర్థమైంది. అంతలోనే 'మహారాజుగారు అక్కడే కూర్చున్నారుగదా!? మరెలాగ?' అని నాకు ఆందోళన కలిగింది. వెంటనే 'ఏదైతే అదవుతుంది' అని, నా బాణాన్ని అటువైపుకు మళ్లించాను" అన్నాడు అమరేంద్రుడు, వినమ్రంగా.

రాజుగారు "భళా! సైనికుడన్నవాడికి సునిశితమైన గ్రాహ్య శక్తి అవసరం- సుశిక్షితుడైన సైన్యాధికారి శబ్దాన్ని బట్టి శత్రువు ఎవరన్నది అంచనా వేయగలిగి ఉండాలి. ఈ రెండు శక్తులే కాక, నీలో గొప్ప రాజభక్తి కూడా ఉన్నదని

నిరూపించుకున్నావు. అమరేంద్రా, ఇప్పుడు నా ప్రాణాలు కాపాడావు- రేపు మన రాజ్యాన్నీ కాపాడగలవు- సందేహంలేదు" అని పూలహారాన్ని అమరేంద్రుడి మెడలో వేశారు.

ప్రజలందరూ ఆయన నిర్ణయాన్ని ఆమోదిస్తూ హర్షధ్వానాలు చేశారు.

**కలర్ గ్యారెంటీ!**

వెంగళప్ప కలర్ టీవీ కొన్నాక, ఒక సారి దాన్ని పూర్తిగా నీళ్లలో ముంచి లేపాడు- ఎందుకని?

"రంగు పోతుందో లేదో చూద్దామని"

*సేకరణ: G. సుచరిత*

**కలలుండవు!**

రోగి: డాక్టర్! నాకు రోజూ పీడకలలు వస్తున్నాయి.

డాక్టర్: ఈ మాత్రలు వాడండి, సమస్య ఉండదు.

రోగి: ఇవి వేసుకుంటే కలలు రావు కదా, డాక్టర్!?

డాక్టర్: చెప్పాగా, నిశ్చింతగా ఉండండి. ఇవి వేసుకున్నాక అసలు మీకు నిద్రే రాదు!

*సేకరణ: బి.పావని*



# విసర్రాయి కథ

*విసర్రాయి అంటే తిరగలి. వాణి చెప్పిన ఈ విసర్రాయి కథ అనంతపురం జిల్లాలో చాలామందికి తెలుసు.*

*కథనం*: K.*వాణి*, 6 *వ తరగతి, టింబక్టు బడి, చెన్నేకొత్తపల్లి.*

ఒక ఊరిలో అన్నదమ్ములిద్దరు ఉండేవాళ్ళు. పెద్దవాడి పేరు సీను; చిన్నవాడి పేరు రాము. రాము చాలా అమాయకుడు. సీను మాత్రం తెలివిమంతుడు. వాళ్ల నాన్న చిన్న ఉద్యోగస్తుడు. వయసు ఐపోయింది. చనిపోయే ముందు ఇద్దరినీ పిలిచి "నా తావ ఉండేది ఈ ఇల్లు, ఈ గొడ్డలి- వీటిని రెండింటినీ పంచుకొని ఇద్దరూ మంచిగా బ్రతకండి" అని చెబుతూ కన్ను మూశాడు.

సీను తెలివిమంతుడు కదా, తమ్ముడిని పిలిచి " ఒరే తమ్ముడూ! నాన్న చెప్పాడు కదా, ఇల్లును-గొడ్డలిని పంచుకొమ్మని?" అన్నాడు.

తమ్ముడు "ఔను అన్నా!" అన్నాడు. అప్పుడు సీను "రాముూ, నువ్వు గొడ్డలిని తీసుకో, నేను ఇల్లు తీసుకుంటాను. అలా ఇద్దరమూ చక్కగా బ్రతుకుదాం!" అన్నాడు.

అదివిని, రాము "మా అన్నకు నేనంటే ఎంత ఇష్టమో!" అనుకొని, సరే అన్నాడు.

రాము ఆ గొడ్డలిని తీసుకొని కట్టెలు కొట్టుకుంటూ జీవనం సాగించుకొనేవాడు. ఇద్దరికీ భార్యా పిల్లలు ఉన్నారు. ఒకరోజు రాము భార్య నాలుగు రొట్టెలు చేసి పంపించింది. రాము మామూలుగానే కట్టెలు కొట్టుతున్నాడు. అన్నం ఆకలి అవుతుంటే తిందామని రొట్టెలమూట విప్పాడు.

రెండు రొట్టెలు తిన్నాడో లేదో- పరుగెత్తుకుంటూ ఒక ముసలాయప్ప అక్కడికి వచ్చి "నాయనా, నాకు చాలా ఆకలి అవుతున్నది. ఒక రొట్టె పెట్టవూ!" అన్నాడు.

"సరే తాతా! ఇక్కడ కూర్చో, పెడతాను" అన్నాడు రాము. తన దగ్గర మిగిలిన రెండు రొట్టెలనూ అతనికి పెట్టాడు; ప్రక్కన ఉన్న చెంబు తీసుకొని చెరువుకు వెళ్ళి నీళ్లు తెచ్చి ఇచ్చాడు. ఆ తాత కడుపునిండా తిని, నీళ్ళు త్రాగి "చల్లగా ఉండు నాయనా" అని దీవించి పోయాడు. రాము కూడా కడుపునిండా నీళ్ళు త్రాగి, కట్టెలు కొట్టుకొని ఇంటికి పోయాడు.

రెండోరోజు కూడా ముసలాయప్ప అలాగే వచ్చాడు. ఆ రోజు కూడా రాము అతనికి అన్నం పెట్టాడు. "తాతా, నీది ఏ ఊరు?" అని అడిగాడు. "నాది చాలా దూరపు ఊరు నాయనా!" అన్నాడు

ఆయన. "మరి ఇటు వైపుకు ఎందుకు వచ్చావు?" అని అడిగాడు రాము. "నేను శిల్పాలు చెక్కుతుంటాను నాయనా!" అన్నాడు తాత. "మరైతే నాకు ఒక విసర్రాయిని తెచ్చి ఇస్తావా, రోజూ నీకు రొట్టెలు తెచ్చి ఇస్తాను?" అడిగాడు రాము. "దానిదేముంది? రేపు నీకో విసర్రాయిని తెచ్చి ఇస్తానులే" అన్నాడు తాత. అన్నమాట ప్రకారం మరునాడు ఒక విసర్రాయిని తెచ్చి ఇచ్చాడు రాముకు.

దాన్ని ఇంటికి తెచ్చి, భార్యకు ఇచ్చాడు రాము. రాము భార్య దానిలో కొన్ని రాగులు పోసి విసిరింది- ఆశ్చర్యం! ఆ విసర్రాయి కుప్పలు కుప్పల రాగిపిండిని బయటికి పోసింది! ఆమె ఆశ్చర్యపడి, రాముని పిల్చింది, చూడమని. రాము వచ్చి చూసే సరికి, రాగి పిండి కుప్ప పెద్దదైపోతోంది, ఇంకా! రాము "ఇంత రాగిపిండి ఏమి చేసుకోను, చాలు చాలు" అన్నాడు. విసర్రాయి ఆగిపోయింది! ఇంక ఆ రోజునుండి రాము ఇంట్లో తిండికి కొరత లేకుండా అయ్యింది.

ఒకసారి వాళ్ల నాన్న చనిపోయిన రోజు వచ్చింది. "ఆ రోజున అందరికీ భోజనాలు పెట్టాలి" అనుకున్నాడు రాము. ఊరంతటినీ పిలిచి భోజనాలు పెట్టాడు. ఊరంతా రాము గురించి చాలా గొప్పగా చెప్పుకున్నది.

అది విన్నాడు, వాళ్ల అన్న సీను. "ఎట్లా చేశాడు వీడు? ఏదో మంత్రం ఉంది!"అని భార్యను కూడా వెంట బెట్టుకొని వచ్చాడు. వాళ్లను చూడగానే రాము లేచి వెళ్ళి, వాళ్లను ఇంట్లో లోపల కూర్చో బెట్టుకొని, మర్యాద చేశాడు. అట్లా వాళ్లకు ఇసర్రాయి ఉన్న రహస్యం తెలిసింది.

అప్పుడు సీను తమ్ముడిని "రామూ! నాకు ఈ విసర్రాయి ఇవ్వు బుజ్జీ!" అని అడిగాడు.

“నువ్వు ఏదైనా అడుగు ఇస్తాను, కానీఈ విసర్రాయి మాత్రం అడగొద్దన్నా!” అన్నాడు రాము.

"సరేలేరా, నీ యిష్టం" అని, అన్న వదిన ఆరోజు రాత్రికి అక్కడే పడుకున్నారు.

అయితే రాత్రి వాళ్లకి నిద్ర పట్టలేదు- "ఎలాగైనా విసర్రాయిని ఎత్తుకుపోవాల్సిందే" అని, అర్థరాత్రి లేచి, అక్కడ నాలుగు రొట్టెలుంటే వాటిని మూట కట్టుకొని, విసర్రాయిని ఎత్తుకొని అన్న, వదిన ఇద్దరూ ఉడాయించారు. ఒకసారి సముద్రం ఒడ్డుకు చేరుకున్నాక, వాళ్ళిద్దరూ పడవ ఎక్కి చాలా దూరం పోయారు.

మధ్యలో వాళ్ళిద్దరికీ చాలా ఆకలైంది. "రొట్టెలున్నాయికదా, తిందాం" అని, వాళ్ళిద్దరూ రొట్టెలు తినబోయారు. చూస్తే ఆ రొట్టెల్లోఉప్పులేదు! అప్పుడు వదిన అన్నది "విసర్రాయి ఉంది కదా, ఎంత ఉప్పు ఇమ్మంటే అంత ఇస్తుంది!" అని, విసర్రాయిని తిప్పి, ఉప్పు ఇమ్మన్నది. వెంటనే విసర్రాయి మూటలు మూటల ఉప్పు ఇవ్వటం మొదలు పెట్టింది. అన్న, వదిన ఆశ్చర్యంగా చూస్తూ పోయారు.. చూస్తూండగానే పడవంతా ఉప్పుతో నిండిపోయింది!

"ఇదేంటి, ఇదేంటి" అంటున్నారుగానీ, అన్న వదినలకు విసర్రాయిని ఎలా ఆపాలో తెలీలేదు. ఉప్పు బరువుకి వాళ్ళిద్దరూ ఎక్కిన పడవ కాస్తా మునిగిపోయింది. అన్న వదిన ఇద్దరూ ఏమయ్యారో తెలీదుగానీ, విసర్రాయి మాత్రం సముద్రం అడుగుకి చేరుకున్నదట. అక్కడే అది మూటలు మూటల ఉప్పు తయారు చేస్తున్నదట ఇంకా- అందుకనే సముద్రపు నీళ్ళు ఉప్పగా ఉంటాయట!



# కష్టానికి ప్రతిఫలం

*రచన: S.M.ముజామిల్, 6 వ తరగతి, శ్రీకృష్ణవేణి టాలెంట్ స్కూల్, పటమట, విజయవాడ.*

అనగనగా ఒక రాజ్యంలో చాలామంది సోమరిపోతులు ఉండేవాళ్ళు. ఆ రాజ్యపు రాజధానిలో గొప్ప రాచబాట ఒకటి ఉండేది. ప్రజలందరూ కలుసుకునేది ఆ బజారులోనే. సోమరిపోతులందరూ ఒక ప్రక్కన గుంపులు గుంపులుగా నిలబడి చోద్యం చూస్తుంటే, మిగతా వాళ్ళు కొందరు హడావిడిగా నడుస్తూంటే, అందరూ నవ్వుకుంటూ, మాట్లాడుకుంటూ సమయాన్ని వృధా చేస్తుండేవాళ్ళు.

ఆ రాజ్యపు రాజు, పాపం చాలా మంచివాడు- తన ప్రజలు ఇట్లా సోమరిపోతులుగా ఉండటం అతనికి నచ్చేది కాదు. వాళ్ళని ఎలాగైనా సరే, సరైన

దారికి తేవాలని తపించేవాడు. ఒకరోజు రాత్రి, మారువేషం వేసుకొని, ఒక చెట్టు నీడన ఊరికే కూర్చున్నాడు, తన ప్రజల్ని గమనిస్తూ. అర్థరాత్రి దాటిన తర్వాత, ఎవరూ లేని సమయం చూసుకొని, రహదారి మధ్యలో ఒక పెద్ద గుంత త్రవ్వాడు. ఆ గుంతలో బంగారం, వజ్రాలు, వైఢూర్యాలు వేసాడు. దగ్గరలోనే ఉన్న ఒక పెద్ద బండరాయిని మోసుకొచ్చి, ఆ గుంతను కప్పిపెట్టి, నేరుగా తన భవనానికి వెళ్ళిపోయాడు.

తెల్లవారు జామున ఆ ప్రదేశాన్ని గమనించటం కోసం కొందరు సైనికులను నియోగించాడు. మెల్లగా తెల్లవారింది. రాయి రోడ్డు మధ్యలో అందరికీ అడ్డంగా ఉంది. ప్రజలకు చాలా ఇబ్బందికరంగా ఉన్నది కూడాను. అందరూ ఇబ్బంది పడుతున్నారు గాని, ఒక్కరు కూడా ఆ రాయిని ప్రక్కకు తొలగించటం లేదు. కొందరు సోమరిపోతులైతే, ఏకంగా ఆ రాయి మీదే కూర్చొని ముచ్చట్లు చెప్పుకోవటం మొదలుపెట్టారు. వాహనాల వాళ్ళు దాన్ని తప్పించుకొని అటూ ఇటూ తిరుక్కుంటూ పోసాగారు.




సాయంత్రం కావస్తున్నది- రోడ్డు మీద జనాల గుంపులు మెల్లగా ఇళ్ళకు కదులుతున్నాయి. రాయికి దగ్గర్లోనే గుగ్గిళ్ళు అమ్ముకునే ఒక ముసలితాత ముందుకు వచ్చాడు. ప్రజలందరికీ ఇబ్బందికరంగా మారిన ఆ రాతిని

తొలగించేందుకు పూనుకున్నాడు. రాయి చాలా బరువుగా ఉన్నది. దాన్ని ఎత్తటం చాలా కష్టం అయ్యింది. కానీ తాత చాలా శ్రమపడి, రాతిని ప్రక్కకు జరిపి చూస్తే ఏముంది?!- వజ్రాలు, బంగారం దొరికాయి. అతని సంతోషం అంతా ఇంతా కాదు.

దీన్నంతా గమనిస్తున్న రాజభటులు ఆ సమాచారాన్ని వెంటనే రాజుకు చేరవేశారు. రాజుగారు స్వయంగా వచ్చి, ముసలి తాతను అభినందించారు. "పదిమందికీ పనికొచ్చే పనుల్లో కష్టం ఉంటుంది. ఆ కష్టానికి వెరవకుండాపనిచేస్తే ఆనందం మన సొంతం అవుతుంది. ఈ తాత చేసిన పనిని మనం అందరం చేయచ్చు. మన సోమరి తనాన్ని వదిలించుకుంటే, సమయాన్ని సద్వినియోగం చేస్తే అందరికీ మేలు జరుగుతుంది" అని రాజుగారు చెప్పిన మాటలు సోమరిపోతుల కళ్ళు తెరిపించాయి. నిజంగానే కష్టానికి ఫలితం ఆనందం.

**వాళ్ల తప్పు!**

విలేకరి: వరుసగా ఆరోసారి మమ్మల్ని ప్రజలు గెలిపించారు కదా, మీకు ఏమనిపిస్తోంది?

మంత్రి: నా అవసరాలింకా తీరలేదని తెలుసుకుని, వాళ్ళంతా నాకు సహకరిస్తున్నారు.




# ఇష్టమైన చదువు

రచన: శ్రీమతి నాగలక్ష్మి, ఉపాధ్యాయిని, K.S.R.ప్రభుత్వ బాలికోన్నత పాఠశాల, అనంతపురం.

కోణాపురంలో తరుణ్, తనూజ్‌ల ఇళ్ళు ప్రక్క ప్రక్కనే ఉండేవి. ఇద్దరి అమ్మానాన్నలూ కూలి పనికి పోయేవాళ్ళు. అంతా కలిసి మెలిసి ఉండేవాళ్ళు. పిల్లలిద్దరిదీ, ఒకే స్కూలు, ఒకే తరగతి- తరుణ్‌కు బడికి వెళ్ళటం అంటే ఇష్టం- కానీ తనూజ్‌కు మాత్రం బడి అంటే అస్సలు ఇష్టం లేదు.

వాడు అసలు సరిగ్గా బడికే వెళ్ళేవాడు కాదు. అయిష్టంగా పాఠాలు విని, అస్సలు చదవకుండా, రోజూ తిట్లు తినేవాడు. ఎప్పుడూ తక్కువ మార్కులే వచ్చేవి వాడికి.

కానీ వాడికి పాటలంటే మాత్రం చాలా ఇష్టం. ఎప్పుడూ ఏవో కూనిరాగాలు తీస్తూ ఉండేవాడు. 'ఈ పాటల పిచ్చిలో నీ చదువులన్నీ చట్టు బండలౌతున్నాయి చూడు" అని వాళ్ళ అమ్మానాన్నలు అరిచేవాళ్ళు. అయినా వాడు పట్టించు-కునేవాడు కాదు.

ఒకసారి పాటలు పాడే కళాకారుల బృందం ఒకటి కోణాపురం వచ్చింది. ఊళ్ళోని యువకులు చాలామంది ఆ పాటలు వినటానికి వెళ్ళారు. వాళ్లందరితో పాటూ తనూజ్ కూడా వెళ్ళాడు. అటు తర్వాత ఆ బృందం వాళ్ళు కోణాపురంలో కార్యక్రమం ముగించుకొని వేరే ఊరికి బయలుదేరేటప్పుడు, తనూజ్ కూడా వాళ్ళతోపాటు బయలుదేరి వెళ్ళి-పోయాడు- ఇంట్లో ఎవ్వరికీ ఏమీ చెప్పకుండానే!

తనూజ్ అమ్మానాన్నలు వాడికోసం ఊరంతా వెతికారు; కనబడినా వాళ్లనల్లా అడిగారు- చివరికి వాడిని గాయకుల బృందంతో చూసిన వాళ్ళెవరో చెబితే, పొరుగూరు వెళ్ళి తనూజ్‌ను వెంటబెట్టుకొని వచ్చారు. వాడిని బాగా చీవాట్లుపెట్టారు- ఎంత తిట్టినా వాడు వెక్కి-వెక్కి ఏడ్చాడు తప్పితే, తన తప్పును మాత్రం ఒప్పుకోలేదు.

చివరికి వాళ్ల నాన్న వాడిని దగ్గరకు తీసుకొని, "ఒరే! నీ సమస్య ఏమిటిరా? నీకు బడి అంటే ఇష్టం ఉన్నట్లు లేదే? మార్కులు కూడా తక్కువ వస్తుంటాయి- ఎందుకు? చెప్పు" అని నెమ్మదిగా, ప్రేమగా అడిగాడు.

"నాకు బడికి పోవటం ఇష్టం లేదు- పాటలంటేనే ఇష్టం" అన్నాడు తనూజ్, ఏడుస్తూ.

అప్పుడు వాళ్ల నాన్న వాడిని బుజ్జగిస్తూ "బాబూ! నువ్వు బడికి వెళ్ళు; ప్రతిరోజూ

సాయంత్రంపూట నీకు ఇష్టమైన సంగీతాన్ని నేర్పించే బాధ్యత నాది- సరేనా?" అన్నాడు.



ఆరోజే ఆయన తనూజ్‌ను సంగీతం నేర్పే గురువుగారి దగ్గరికి తీసుకెళ్ళాడు. తనూజ్‌కు పాటలంటే ఉన్న ఇష్టాన్ని గుర్తించి ఆయన వాడిని శిష్యుడిగా చేర్చుకున్నారు. ఆనాటినుండీ ప్రతిరోజూ తనూజ్ ఉదయం బడికి; సాయంత్రం బడి నుండి రాగానే సంగీతం నేర్చుకోటానికి- వెళ్ళటం మొదలు పెట్టాడు.

ఆశ్చర్యం! ఒకసారి సంగీతానికి వెళ్ళటం మొదలు పెట్టాడో, లేదో, వాడు చదువుల్లోనూ రాణించటం మొదలు పెట్టాడు! ఇప్పుడు వాడికీ బడి అంటే ఇష్టం ఏర్పడింది. తరుణ్‌తో సమానంగా మార్కులు తెచ్చుకోసాగాడు!

కాలక్రమంలో తరుణ్, తనూజ్ ఇద్దరూ ఉపాధ్యాయ వృత్తిని చేపట్టారు. ఇప్పుడు తనూజ్ పిల్లలకు చదువులతోపాటు సంగీతాన్నీ నేర్పిస్తున్నాడు. పాటలు మాధ్యమాలుగా తనూజ్ నేర్పే విషయాలు అందరు పిల్లలకూ సులభంగా అర్థమౌతున్నాయి. "పాట-ఆట చదువులకు ఆటంకాలు కావు-వాటివల్ల చదువులూ సుసంపన్నం అవుతాయి. దానికి నేనే మంచి ఉదాహరణ" అని అందరికీ చెబుతుంటాడు తనూజ్!



# స్నేహం

*రచన: సి. మారుతి, బసినేపల్లి, అనంతపురం జిల్లా.*

అది ఒక మారుమూల గ్రామం. అక్కడ నుండి పట్నం వెళ్ళాలంటే ఎన్ని రోజులైనా కాలి నడకన పోవల్సిందే మరి! అలాంటి మారుమూల గ్రామంలో ఉండేవాడు అంజి. చిన్నతనం లోనే అతని తల్లిదండ్రులు చనిపోయారు. అప్పటినుండీ తినటానికి తిండి లేక, బ్రతుకు బండిని తోసుకు పోలేక అతను నానా కష్టాలు పడ్డాడు. అలాంటి పరిస్థితుల్లో అతనికి పవన్ అనే పిల్లవాడు పరిచయం అయ్యాడు.

పవన్ వాళ్ళ నాన్న ఆ ఊరిలోకెల్లా ధనవంతుడు. అయినా పవన్‌కు రవంతైనా గర్వం ఉండేది కాదు. అంతేకాక అతనిది చాలా జాలిగుండె కూడా. పవన్‌కు అంజిని చూస్తే జాలి అనిపించింది. అంజి

వేసుకునేందుకు బట్టలు, తినేందుకు ఆహారం, స్కూలు ఫీజులకు డబ్బులు- ఇవన్నీ ఇచ్చి ఆదుకున్నాడు. పవన్ వాళ్ళ అమ్మ-నాన్న కూడా దీనికి అడ్డుచెప్పలేదు. పవన్ చేసే మంచి పనులను వాళ్ళూ ప్రోత్సహించేవాళ్లు.

ఒకసారి కనీస అవసరాలు తీరాక, అంజి తప్పుదారులు తొక్కటం మొదలు పెట్టాడు. చెడు స్నేహాలు మొదలయ్యాయి. క్రమంగా దొంగతనం కూడా అలవడింది. అది పవన్‌కు నచ్చలేదు. దాంతో వాళ్ళిద్దరికీ పోట్లాటలు మొదలయ్యాయి. పవన్ అంజితో మాట్లాడటం మానేశాడు.

మొదట్లో ఆ సంగతిని అంజి కూడా పట్టించుకోలేదు. అయితే చెడు స్నేహాలు మప్పిన వాళ్ళంతా రాను రాను ముఖం చాటు చేశారు. దొంగతనాలు తనకు తిండి పెట్టవని అంజికి త్వరలోనే తెలిసి వచ్చింది. కానీ ఇప్పుడు ఆ సంగతిని గుర్తించి ఏమి ప్రయోజనం? పవన్‌కి ముఖం చూపించాలంటే కూడా సిగ్గు వేసింది అంజికి. దాంతోబాటు తిండి తిప్పలకూ కష్టమైంది మళ్ళీ.

అందుకని అంజి ఆ ఊరిని వదిలి, దగ్గరలోనే ఉన్న మరో ఊరికి వలస వెళ్ళిపోయాడు. అతని అదృష్టంకొద్దీ ఆ ఊళ్ళో ప్రభుత్వ బడి, ప్రభుత్వ వసతి గృహం చక్కగా పనిచేసేవి! అట్లా అంజికి చదువుకునేందుకు కనీస వసతులు లభించాయి.



దురలవాట్లనుండి దూరంగా

ఉండాలని నిశ్చయించుకున్నాడు గనక, ఇప్పుడు అతను మానసికంగా గట్టి పడ్డాడు కూడాను. దాంతో అంతవరకూ బయటపడని అతని తెలివి తేటలు బయటపడటమూ మొదలైంది! సంవత్సరం తిరిగే సరికి, ఆ ఊళ్ళో అందరిలోకీ చక్కగా చదివే పిల్లవాడుగా పేరు తెచ్చుకున్నాడు అంజి.

అలా ఉండగా ఒకసారి ఆ ఊరికి జిల్లా కలెక్టర్ గారు వచ్చారు. కలెక్టర్ గారి మాటలు అంజికి బాగా నచ్చాయి. "బాగా చదువుకుంటే నేను కూడా కలెక్టరును కావచ్చు. నేను కలెక్టరునై మన దేశంలో అసలు పేదరికం అన్నదే లేకుండా చేస్తాను" అని, అంజి మరింత పట్టుదలతో చదవసాగాడు.

పదవ తరగతిలో మంచిమార్కులతో పాసైన అంజికి పై చదువులు ఉచితంగా చదువుకునేందుకు తగిన స్కాలర్షిప్పులు దొరికాయి. ఇక అతను ఆ పైన దేశం మొత్తానికీ పేరెన్నిక గన్న విశ్వవిద్యాలయాల్లో చదివి, గొప్ప అర్హతలు సంపాదించు-కున్నాడు. చివరికి అంజి, తన చిరకాల స్వప్నమైన ఐఏఎస్‌ను సాధించగలిగాడు కూడా. అలా తను పుట్టిన జిల్లాకే అంజి కలెక్టరుగా వచ్చాడు.

ఆ సరికి పవన్ కూడా పెద్దయ్యాడు. తన ఆస్తినంతా వాడి, ఒక చక్కని స్వచ్ఛంద సంస్థను నెలకొల్పిన పవన్, తన ఊరికి, పర్యావరణానికి మేలు చేసే పనులు అనేకం చేపట్టి ఉన్నాడు. కొత్త కలెక్టరు గారు తన బాల్య స్నేహితుడైన అంజే అని తెలిసినప్పటికీ అతను నిర్లిప్తంగానే ఉండిపోయాడు తప్ప, వెళ్ళి అంజిని కలవలేదు.

బాధ్యతలు చేపట్టిన కొన్ని నాళ్ళకు అంజి 'త్రాగునీటి సౌకర్యం' కార్యక్రమం సందర్భంగా తను పుట్టిన ఊరికి వెళ్ళాడు. గ్రామంలోని ప్రజలంతా అతన్ని చూసి "ఓరి

ఓరి! ఎంత పెద్దోడివైనావు" అన్నారు సంతోషంగా. కానీ అంజి కళ్ళు మాత్రం పవన్ కోసం వెతికాయి. ఎక్కడా పవన్ జాడలేదు! చివరికి ఉండబట్టలేక, కలెక్టరు గారు అంజిని వెతుక్కుంటూ వాళ్ళ ఇంటికి వెళ్ళారు.

అక్కడ పవన్ కూర్చొని తన పని తాను చేసుకుంటూ ఉన్నాడు. అంజి వెళ్ళి అతన్ని ఆప్యాయంగా పలకరించి, "నువ్వెందుకు, ఇంకా నన్ను శిక్షిస్తున్నావు? నేను ఆనాటి చెడ్డ అంజిని కాదు. నువ్వు నన్ను విడచిన కొన్నాళ్ళకే నా కళ్ళు తెరచుకున్నాయి. అప్పటినుండీ నీ చలవ వల్ల, మంచి మార్గంలోనే నడిచాను. నువ్వు మంచి సామాజిక కార్యకర్తవని విన్నాను- ఇప్పటికైనా, నీకు అభ్యంతరం లేకపోతే, మనం కలసి పనిచేద్దాం. మన దేశంలో పేదరికం అన్నదే లేకుండా చేద్దాం. మన గ్రామం నుండే మన పనిని ప్రారంభిద్దాం " అన్నాడు.

అప్పటి వరకూ అంజిని దూరంగా ఉంచిన పవన్ లేచి నిలబడి అతన్ని దగ్గరకు తీసుకున్నాడు. అక్కడే నిలబడి చూస్తున్న కోడిపుంజు 'కొక్కొరొకో' అని అరిచింది.

**కొత్తభాష**

రంగయ్య: ఈ మధ్య మా మనవరాలు ముఖానికి రాసుకొనే పౌడర్ ని 'బొగడ్రు' అంటోంది. 'ఎవరు?' అనడానికి బదులు 'ఎవలు' అంటోంది.. ఎందుకంటావు?

రామయ్య: టీవీ ఎక్కువగా చూస్తోందేమో!?

సేకరణ: జయ దుర్గ



# రంగయ్య కథ

*రచన: రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషివ్యాలీస్కూలు, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

ఒక ఊళ్ళో రంగయ్య అనే రైతు ఉండేవాడు. చాలా కష్టపడి పొలంపని చేసేవాడు అతను. అతని భార్య సుభద్రమ్మ కూడా అతనికి బాగా సాయం చేసేది. నాట్లు వేయడం, కలుపు తీయడం, పైరు కోసుకొని ఇంటికి మోసుకొని రావడం- అన్ని పనులూ ఇద్దరే చేసుకునేవారు.

'ఎలాగో ఒకలాగా కష్టపడి డబ్బు సమకూర్చుకొని, మంచి కాడెద్దులు కొనుక్కోవాలి' అని కలగనేవాళ్ళు వాళ్ళు.

కొన్నాళ్ళకు తగినంత డబ్బు సమకూరింది. "ఇక ఎద్దులు కొనుక్కుందాం" అని రంగయ్య సంతకు బయలుదేరాడు.

మంచి ఎద్దుల జత కోసం సంతంతా కలయ తిరుగుతుండగా ఒక చోట మంచి

బలమైన ఎద్దులు కనిపించాయి. వాటి యజమాని సోమయ్య పచ్చి మోసగాడు. అది తెలీదు కదా, రంగయ్యకు? ఆ ఎద్దులనే బేరం చేసి కొనుక్కున్నాడు. ఎద్దులను తోలుకొని మెల్లగా ఊరు చేరుకున్నాడు.

రంగయ్య ఎద్దుల్ని చూసి ఆ ఊరి జనం అంతా "బాగున్నాయి" అని మెచ్చుకున్నారు. సుభద్రమ్మ ఎదురు వచ్చి, ఎద్దులకు హారతి ఇచ్చింది. వాటికి దిష్టి తగలకుండా ఉండేందుకుగాను తన చీర కొంగును సన్నగా చించి, రెండు ఎద్దుల ఎడమ కాళ్ళకూ కట్టింది.

"వాటికి బలమైన తిండి పెట్టాలి- అందుకోసం ఇద్దరం ఇంకా బాగా కష్టపడాలి" అనుకుంటూ సంతోషంగా ఆ రాత్రి నిద్రపోయారు ఇద్దరూ. ఉదయాన్నే లేచి రంగయ్య కొట్టంలోకి వెళ్ళి చూస్తే ఏముంది? అక్కడ ఎద్దులు లేవు! కట్టుత్రాళ్ళను తెంపుకొని ఎద్దులు రెండూ పారిపోయాయి!

రంగయ్యకు గుండె ఆగినంత పని అయ్యింది. భార్యాభర్తలు ఇద్దరూ చుట్టు ప్రక్కల వాళ్లను అడిగారు; ఊరి పొలాల్లో వెతికారు- లాభం లేదు- ఎద్దులు దొరకనే లేదు! ఆ సరికి బాగా పొద్దెక్కింది. ఏం చేయాలో పాలు పోలేదు ఇద్దరికీ. "అమ్మిన వాడి దగ్గరికే వెళ్ళి ఉంటాయి చూడండి" అన్నారు అందరూ.

అయితే సోమయ్య ఏ ఊరి వాడో రంగయ్యకు గుర్తురాలేదు! 'సంత దగ్గర విచారిస్తే ఏమైనా తెలుస్తుందేమో' అని రంగయ్య, సుభద్రమ్మ ఇద్దరూ సంతకి బయలుదేరారు. సంతలో ఎవరిని అడిగినా 'తెలియదు' అనే అన్నారు!

దిగులుతో బిక్క చచ్చిపోయి సంతంతా కలయ తిరుగుతున్న రంగయ్య-సుభద్రమ్మలకు ఒకచోట ఎద్దులతోపాటు నిలబడి కనబడ్డాడు, సోమయ్య! ఇప్పుడు

ఆ ఎద్దుల కొమ్ములకు వేరే రంగు వేసి ఉంది- అయితే వాటి కాళ్ళకు తాము కట్టిన దిష్టి దారాలు ఇంకా అలానే ఉన్నై!

ఇద్దరూ పరుగున అక్కడికి చేరి సోమయ్యను నిలదీశారు. విషయం ఇంకా చెప్పకనే సోమయ్య – "భలేవాళ్ళే! ఇవి వేరే ఎద్దులు! మీరు కొనుక్కున్నవి నా దగ్గరెందుకు ఉంటాయి? పారిపోయి ఏ చేలల్లో పడి మేస్తున్నాయో వెతుక్కోండి!" అని దబాయించాడు.

జనం గుమిగూడారు. రంగయ్య, సుభద్రమ్మ అందరితోటీ మొరపెట్టు- కుంటున్నారు. కొంతమంది అటువైపు, కొంతమంది ఇటువైపు మాట్లాడుతు- న్నారు. రంగయ్య సుభద్రమ్మ చెవిలో చెప్పాడు- గ్రామాధికారిని పిలుచుకు రమ్మని. ఆమె గుంపులో నుంచి బయటపడి పరుగున గ్రామాధికారి దగ్గరకు వెళ్ళి ఫిర్యాదు చేసింది. ఆయనను వెంట- బెట్టుకొని వచ్చింది. సంతలోని జనం ముందు ఆయన విచారణ మొదలు పెట్టాడు. సోమయ్య బుకాయిస్తూనే ఉన్నాడు; రంగయ్య-సుభద్రమ్మల దగ్గరేమో సరైన సాక్ష్యం లేదు!

"నా చీర కొంగును చింపి, పీలికలు ఎద్దుల కాళ్ళకు కట్టాను- కావాలంటే ఆ చీరను తెచ్చి చూపిస్తాను. మా ఊళ్ళో ఈ ఎద్దుల్ని చూసిన వాళ్ళను కొందరిని సాక్ష్యానికి తీసుకు వస్తాను. ఈ ఎద్దులు మావే, నమ్మండి" అని కళ్ళ నీళ్ళు పెట్టుకున్నది సుభద్రమ్మ. గ్రామాధికారికీ అది సరయిన పని అనిపించింది. "ఈరోజు చీకటి పడింది కనుక ఎద్దులను మా కొట్టంలో కట్టేసి అందరూ ఇళ్ళకు పోండి. విచారణను రేపు కొనసాగిస్తాం" అన్నాడాయన.

రంగయ్యకు ఆ సరికి అర్థం అయిపోయింది- "ఆ ఎద్దులు దొంగవి!

ఎక్కడ వదిలినా సరే, రాత్రిపూట కట్టుత్రాళ్ళు తెంపుకొని అవి సోమయ్య ఇంటికి చేరుతాయి! అలా వాటికి శిక్షణ ఇచ్చి ఉంచాడు సోమయ్య!" అందుకని సాక్ష్యాలకోసం సుభద్రమ్మని ఇంటికి పంపి, తను మాత్రం ఆ రాత్రంతా గ్రామాధికారి కొట్టం ముందే కాపలా కాశాడు, రంగయ్య.

అర్థరాత్రి అయింది- ఎద్దులు తమ అలవాటు ప్రకారం తాళ్ళు ఊడబెరుక్కుని సోమయ్య ఊరి దారి పట్టాయి. రంగయ్య వాటిని ఏమీ అనలేదు- ఊరికే అనుసరిస్తూ వెళ్ళాడు. అవి నేరుగా సోమయ్య కొట్టం ముందుకు చేరాయి. అక్కడ వాటి కోసమే ఎదురు చూస్తున్నాడు, సోమయ్య. వాటిని పట్టుకొని కొట్టంలోకి తీసుకెళ్ళాడు. గుడ్డి దీపం వెలుగులో అప్పటికప్పుడే వాటి కొమ్ములను సగానికి కోసి పడేశాడు. ప్రక్కనే ఉన్న రంగు డబ్బాలని తీసి కొమ్ములకు కొత్తగా వేరే రంగు వేశాడు. వాటి కాళ్ళకు సుభద్రమ్మ కట్టిన పీలికలను విప్పేసాడు. ఇప్పుడు గిట్టలకు కూడా రంగు వేశాడు; తోకలకున్న వెంట్రుకలను పూర్తిగా గొరిగేశాడు.

చాటుగా నక్కి ఇదంతా చూశాడు రంగయ్య. నిశ్శబ్దంగా వెనక్కు తిరిగి వెళ్ళాడు. గ్రామాధికారిని నిద్రలేపి, తను చూసిందంతా వివరించాడు.

గ్రామాధికారి వెంటనే తన మనుష్యులతో పాటు బయలుదేరి వెళ్ళాడు. సోమయ్యను బంధించి న్యాయస్థానానికి అప్పగించాడు. మోసకారి సోమయ్యను పట్టించినందుకు రంగయ్య దంపతులను అభినందించాడు.

గ్రామాధికారికి ధన్యవాదాలు తెలుపుకుని తన ఎద్దులను తన ఇంటికి తెచ్చుకున్నాడు రంగయ్య! తెలివిగాను, ఓపికతోటీ గొడవ చెయ్యకపోతే అతని ఎద్దులు అతనికి దొరికేవి కావు!



# లేడికూన-మొసళ్లు

*మనందరికీ తెలివైన జంతువుల కథలు ఇష్టం కదా! రాళ్ళు వేసి కూజాలోంచి నీళ్ళు తాగిన కాకి, సింహాన్ని బోల్తా కొట్టించిన కుందేలు, తెలివిగా కష్టాలనుండి తప్పించుకున్న నక్క- ఇవన్నీ మనకు బాగా తెలుసు. ఇండోనీషియా, మలేసియా దేశాల పిల్లలకేమో, మరి ఓ తెలివైన లేడికూన కథలు వచ్చు. ఇవిగో, వాటిలోకొన్ని-*

*ఆంగ్లమూలం: ఆరాన్‌షెపర్డు. తెలుగు అనువాదం: జి.వి.జి.కె. రాజు, బెంగుళూరు.*

ఒకరోజున, నీళ్ళు తాగుదామని నది దగ్గరికి పోయింది, లేడికూన. దగ్గర్లోనే ఎక్కడో మొసలి దాక్కుని ఉందని దానికి అనుమానం వచ్చింది. మరి నిజంగానే నీళ్ళలో మొసలి ఉందో, లేదో- ఎట్లా, తెలిసేది?

చటుక్కున లేడికూనకి ఒక ఉపాయం తట్టింది.

అది పెద్దగా అన్నది- "చల్లటి నీళ్ళు తాగుదామని ఉంది- ఈ నీళ్ళు చల్లగా ఉన్నాయో లేదో?! కాలు పెట్టి చూస్తే పోలా?" అని.

నిజంగానే అక్కడ నీళ్ళలో ఒక వెర్రి మొసలి దాక్కుని ఉంది. దానికి చాలా సంతోషం వేసింది. "ఆహా! ఇవ్వాళ లేడి కూర నాకు!" అని దాని నోట్లో చాలా నీళ్ళు ఊరాయి.

అయితే లేడికూన ఏం చేసిందనుకున్నారు? కాలు పెట్టలేదు, నీళ్ళలో! ఒక కర్రపుల్లను తీసి, నీళ్ళలో ముంచింది, బుడుంగున. తయారుగా ఉన్న మొసలి వెంటనే ఒక్క దూకు దూకింది: ఆ పుల్లను దొరకబుచ్చుకుని, నీళ్ళలోకి లాక్కున్నది.

లేడికూన పెద్దగా నవ్వింది. వేరేచోటికి పోయి చక్కగా నీళ్ళు తాగింది.

*****



ఇంకో రోజున లేడికూన మళ్ళీ నీళ్ళు తాగడానికి పోయింది. చూస్తే నదిలో ఒక కర్ర దుంగ తేలుతూ ఉంది. అయితే నీళ్ళలో తేలే మొసలి కూడా దుంగలాగే

ఉంటుంది! మరి అది మొసలా, కర్రదుంగా? -ఎలా, తెలిసేది?

చటుక్కున లేడికూనకి ఒక ఉపాయం తట్టింది.

అది పెద్దగా అరిచింది. "ఇది నా నేస్తం కర్ర దుంగ అనుకుంటాను. కర్ర దుంగ అయితే తప్పకుండా నాతో మాట్లాడుతుంది. అదే ఆ పాడు మొసలి అయితే అస్సలు మాట్లాడదు" అని.

వెంటనే నీళ్ళలోంచి ఒక పెద్ద గొంతు వినిపించింది- "మిత్రమా! నేను నిజంగా కర్రదుంగనే" అని!

లేడికూన నవ్వింది. "పిచ్చి మొసలీ! కర్ర దుంగలు ఎక్కడయినా మాట్లాడతాయా?" అని, పరుగెత్తి పారిపోయింది.

*****



ఒకరోజు లేడికూన తన నేస్తం ఏనుగుతో కలిసి నది అవతలివైపుకు పోయింది. అక్కడ చాలా పండ్లు, దుంపలు తిన్నది. కడుపు నిండగానే దానికి ఇంటికి పోవాలనిపించింది.

చూస్తే ఏనుగు ఇంకా తింటూనే

ఉంది. సరేనని లేడికూన ఒక్కతే బయలుదేరింది. నదిదాకా వెళ్ళి చూస్తే మొసలీ, దాని నేస్తాలూ నీళ్ళలో తయారుగా ఉన్నాయి. ఏనుగు కూడా తోడు లేదాయె. నది దాటేది ఎట్లా?

కొంచెంసేపు ఆలోచిస్తే దానికి ఒక ఉపాయం తోచింది. అది నది దగ్గరికి పోయి, "మొసలీ!" అని పిలిచింది. మొసలి పెద్దగా నోరు తెరిచి "ఆహా లేడికూనా! ఇవ్వాళ నిన్ను తినేస్తాను" అన్నది.

"ఇవ్వాళ కాదు మొసలీ! రాజుగారు నన్ను నదిలో ఎన్ని మొసళ్ళు ఉన్నాయో లెక్క పెట్టుకు రమ్మన్నారు. లెక్క ప్రకారం మీకు సరిపోయినన్ని లేడికూనల్ని పంపిస్తారట. అప్పుడు కడుపునిండా తిందురు" అన్నది. మొసళ్ళన్నీ మహా సంతోషపడిపోయాయి. సరే ఎలా లెక్కపెడతావో చెప్పమన్నాయి.



"ఏముంది, మీరు నది ఈ చివర నుంచి ఆ చివర దాకా వరసా..గా నిలబడండి" అంది లేడికూన. "సరిగ్గా నిలబడకపోతే అన్ని మొసళ్ళూ లెక్కకి రావు! అప్పుడు రాజుగారు ఇచ్చే

లేడికూనలు మీకే సరిపోవు. నాకేం?!" అని తొందర పెట్టింది కూడా. మొసళ్ళన్నీ గబగబా వరస కట్టాయి. లేడికూన మొదటి మొసలి మీదికి దూకింది - "ఒకటి" అని అరిచింది. తరవాత ఇంకో మొసలి మీదికి దూకి, "రెండు" అన్నది. అట్లా దూకుతూ దూకుతూ ఆ పక్కకి చేరి, గట్టు మీదికి దూకేసింది.

"మొత్తం ఎన్ని మొసళ్ళం ఉన్నాం? ఎన్ని లేడికూనల్ని పంపిస్తారు, రాజుగారు?" అడిగాయి మొసళ్ళు, ఆత్రంగా.

"సరిగ్గా నదిని దాటేందుకు కావలిసినన్ని మొసళ్ళు. అన్నీ శుద్ధ మొద్దులు" అని నవ్వుకుంటూ పోయింది లేడికూన.

సంతోషం ఎక్కువైంది!

రైల్వే ఎంక్వయిరీలో-

సోము : " బాబూ " ఫలానా ట్రెయిన్ కాస్త త్వరగా వచ్చే అవకాశం ఉందా?

రాము : "ఏం"?

సోము: " మా ఆవిడ పుట్టింటికి వెళ్తోంది; కొంచెం తొందరగా వెళ్తే బాగుంటుందని!"

*సేకరణ: G. సుచరిత*



# బింబిసారుని పాపం

*మూలం: బుద్ధిస్టు పారాబుల్సు*

*తెలుగు అనుసరణ: నారాయణ, కొత్తపల్లి బృందం.*

బింబిసార చక్రవర్తికి సంతానం లేదు. ఆయనా, ఆయన భార్య వైదేహి ఇద్దరూ సంతానంకోసం అనేక క్షేత్రాలు సందర్శించారు; తీర్థాల్లో స్నానం చేశారు. ఆ సమయంలో వాళ్ళకు ఒక దైవజ్ఞుడు ఎదురయ్యాడు.

"రాజా, నీకు ఒక కొడుకు పుడతాడు, తప్పనిసరిగా! ప్రస్తుతం వాడు ఫలానా కొండల్లో ఋషిగా తపస్సు చేసుకుంటూ ఉన్నాడు. ఆ ఋషే, తన తదుపరి జన్మలో నీకు కొడుకుగా పుట్టనున్నాడు. అయితే మరీ ఎక్కువ ఆశపడకు- ఏమంటే నీ కొడుకువల్ల నీకు సంతోషం కంటే దు:ఖమే ఎక్కువ కలుగుతుంది" అని చెప్పాడు

దైవజ్ఞుడు.



బింబిసారుడి ఆలోచనలు వేగంగా పరుగులు తీశాయి. దైవజ్ఞుడు చెప్పింది నిజమో కాదో తెలుసుకోవాలనుకున్నాడు ఆయన. స్వయంగా బయలు దేరి వెళ్ళాడు కొండల్లోకి. దైవజ్ఞుడు చెప్పినట్లు, అక్కడ నిజంగానే తపస్సులో మునిగి ఉన్నాడొక ఋషి. చూడగా పెద్దగా వయసు ఉన్నట్లు కూడా లేదు- "ఎప్పటికి, ఇతను చనిపోయేది, ఎప్పటికి, నాకు కొడుకుగా పుట్టేది?" అని చాలా విచారం వేసింది బింబిసారుడికి.

మనిషిలో నీతి అడుగంటితే, బలహీనత ఆవరిస్తే ఏమేమి అవుతుందో చూడండి- వెనుతిరిగిన బింబిసారుడికి ఆ క్షణంలోనే బుద్ధి వికటించింది. తకాలున వెనుదిరిగి, కత్తి దూసి, ఆ ఋషిని చంపేశాడు!



త్వరలోనే వైదేహి గర్భం దాల్చింది. నవమాసాలూ నిండాక పండంటి కొడుకును ప్రసవించింది. అందరూ పిల్లవాడిని చూసి మురిసిపోయారు- బింబిసారుడికి మాత్రం సంతోషం లేదు. ""దైవజ్ఞుడి మాట నిజం అవుతున్నది- వీడు, వాడే- నా పాలిటి మృత్యువు! నన్ను

బాధ పెట్టేందుకే పుట్టాడు వీడు. ఎలాగైనా వీడిని వదిలించుకోవాలి" అనిపించసాగింది.



వైదేహి నిద్రపోతున్నప్పుడు, పొత్తిళ్ళలో ఉన్న పిల్లవాడిని ఎత్తుకెళ్ళి, ఒకరోజు రాత్రిపూట, మేడపైనుండి క్రిందపడేశాడు!

అయితే ఆశ్చర్యం! పిల్లవాడికి ఏమీ కాలేదు! బింబిసారుడి దొంగ అరుపులకు పరుగెత్తుకొచ్చిన సేవకులకు, క్రింద పూపొదలో కేరింతలు కొడుతున్న పిల్లవాడు కనిపించాడు!

వైదేహి పిల్లవాడికి 'అజాత శత్రువు' అని పేరుపెట్టి, కంటికి రెప్పలాగా కాపాడుతూ పెంచుకున్నది. బింబిసారుడికి మాత్రం, వాడిని చూస్తే ఒంటిమీద తేళ్ళూ, జెర్రులూ పాకినట్లు అనిపించేది. తండ్రి ఆప్యాయతకు నోచుకోని అజాత శత్రువు చిన్ననాటినుండే చెడ్డపనులు చేయటం మొదలు పెట్టాడు. చెడుస్నేహాలు పట్టి తిరిగాడు; రాజకుమారులు చేయని పనులెన్నో చేశాడు. ప్రతిసారీ, తనని దండించేందుకు వచ్చిన తండ్రిని ఎదిరించేవాడు. వైదేహికూడా వాడినే వెనకేసుకొచ్చేది. వాడి చేష్టలతో బింబిసారుడి తలప్రాణం తోకకు వచ్చేది.

నూనూగు మీసాల వయసు వచ్చేసింది అజాతశత్రువుకు. వాడికి దేవదత్తుడనే మరొక దుర్మార్గుడు తోడయ్యాడు. ఇద్దరూ కలిసి ఒకనాడు బింబిసారుడినీ, వైదేహినీ బంధించి, కారాగారంలో పడేశారు. తండ్రిని

విపరీతంగా ద్వేషించిన అజాత శత్రువు తనను తాను చక్రవర్తిగా ప్రకటించుకున్నాడు. జైల్లో పెట్టిన తల్లిదండ్రులకు అన్నం పెట్టకుండా ఆకలితో మాడ్చి చంపాడు.



అజాత శత్రువు పాపం కూడా ఊరికే పోలేదు. బింబిసారుడు జైల్లో మృతిచెందిన తర్వాత అజాతశత్రువుకు పిచ్చి పట్టిందని చెబుతారు. మానసికంగా దెబ్బతిని, విపరీతమైన అభద్రతాభావంతో ప్రవర్తించే అజాతశత్రువు, అటుపైన బుద్ధభగవానుడి శరణుజొచ్చి, తీవ్రమైన ధ్యానం ద్వారా తన మనసును సన్మార్గంలోకి మళ్ళించుకున్నాడని చెబుతారు.

పాపపు పనులకు దూరంగా ఉండటమే మేలు.

భలే దొంగ

జడ్జి: నిన్నెందుకు అరెస్టు చేశారు?

జానయ్య: తొందరగా షాపింగ్ కి వెళ్లినందుకు.

జడ్జి(ఆశ్చర్యంగా): షాపింగుకు వెళ్తే అరెస్టు చేశారా!? ఎప్పుడు వెళ్ళావు?

జానయ్య: షాప్ ఓపెన్ చేయకముందే వెళ్ళాను సార్!

*సేకరణ: జి.సుచరిత*

# నిరంతరం చిరునవ్వులు

*గానం: ప్రత్యూష, కల్పన, దీప్తి, ప్రతిభ, సుమలత, కిరణ్మయి, నీలవేణి, 8-10 తరగతులు, అభ్యాసవిద్యాలయం, విజయవాడ.*

*సేకరణ, సౌజన్యం: శ్రీమతి కనకదుర్గ, విజయవాడ.*



నిరంతరం చిరునవ్వులు రువ్వే
పూలబాలలం
సుగంధ భరిత-
గులాబీమాలలం

మాయా మర్మం అంటే తెలియని
జాతి ముత్యాలం-
భారత జాతి ముత్యాలం
మోతీ పుత్రుని వారసులం
చాచా నెహ్రూ ప్రేమ పువ్వులం
శాంతి దూత నెహ్రూ..
ఓ శాంతి దూత నెహ్రూ!

సత్యాహింసా శాంతియె సుఖమని
చాటిన గౌతముడే ఈ జగతికి ఆదర్శం
ఆ గౌతమ బుద్ధుని శిష్యులం
ఆ సిద్ధుని ముద్దుల బాలలం
బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి

వందేమాతర రచనలు చేసిన
చటర్జి గీతాలం-
భారత జాతి గీతాలం
వందేమాతర గీతానికే
హడలెత్తె బ్రిటిష్ సామ్రాజ్యం
వందే మాతరం..
వందే మాతరం.

విప్లవ శంఖం పూరిస్తూ-

మన్యప్రజల విల్లంబులు చేస్తూ
దొరల గుండెల్లో దూసుకు పోయిన
అల్లూరి బాణాలం-
రామ రాజు బాణాలం
వందే మాతరం..
వందే మాతరం

సత్యాగ్రహమను ఆయుధం పట్టి
బ్రిటీషువారిని పారద్రోలి
భారతమాతకు స్వేచ్ఛనిచ్చిన
మహాత్మ మనవళ్ళం -
గాంధీ మహాత్మ మనవళ్ళం
రఘుపతి రాఘవ రాజారాం
పతిత పావన సీతారాం
ఈశ్వర అల్లా తేరేనాం
సబకో సన్మతి దే భగవాన్!

మీరూ ఏదైనా కథ రాశారా? ఏదైనా పాట పాడారా, చక్కగా? మీకు చాలా మంచి జోకులేమైనా తెలుసా? మరి, అద్భుతమైన బొమ్మలు ఏమైనా వేశారా? మీ సృజనలు ఎలాంటివైనా సరే, వాటిని కొత్తపల్లికి పంపండి. వీలు చూసుకొని ప్రచురిస్తాం.

మా చిరునామా: *కొత్తపల్లి బృందం, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101.*

# మరో క్రొత్త ఉగాది

*గానం: సరిగమ, తొమ్మిదవ తరగతి, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*

*రచన: శ్రీ వారణాసి వెంకట్రావు గారు, విజయవాడ.*

*సౌజన్యం: "రంగులపూలు" , విద్యార్థి సృజన కుటీర్.*



మరో క్రొత్త ఉగాది- మనకు వచ్చెనమ్మా

వేప మామిడి పూచి -వేడుక చేసెనమ్మా (2)

కావు కావు కావుమని -కాకులు అరచిన మావిని

కోయిలమ్మ కమ్మగా -కొలువుదీరి పాడెనదే (3)

"మరో క్రొత్త ఉగాది"

వాకిలంత ఆకురాల్చి -వాడి మ్రోడైన వేప

పాలజల్లు కురిసినటుల -పూలురాల్చె నేడు చూడు (3)

"మరో క్రొత్త ఉగాది "

ఊపిరణగి ఉన్నటుల -పుల్లలైన మల్లెతీగ

చివురులు సింగారించి-తీగె సాగెనమ్మ నేడు (3)

"మరో క్రొత్త ఉగాది "

# ఎంత చిత్రం

*గానం: కీర్తన, తొమ్మిదవ తరగతి,*
*రచన: శ్రీవారణాసి వెంకట్రావు*
*సౌజన్యం: రంగుల పూలు, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ*



ఎంత చిత్రం ఎంత చిత్రం
చూడగా ఈ వసంతం (2)

కనుల ముందే కాలచక్రం
కదలిపోవుట-
"ఎంత చిత్రం ఎంత చిత్రం"

చినుకు ఒక్కటి పడకనే
చివురు తొడిగే మోడులు
మంత్ర జలములు చల్లినటుల
మారె పచ్చగ ప్రకృతంతా-
"ఎంత చిత్రం ఎంత చిత్రం"



నెలలుగా బోసిపోయిన
గున్నమావులు కొమ్మ కొమ్మకు
కోసుకోమని మాయగా
వేల కాయలు వ్రేలాడుట-
"ఎంత చిత్రం ఎంత చిత్రం"

గొంగళీలే రంగురంగుల
సీతాకోక చిలుకలై
తీరినటుల శాపకాలం
తిరుగుతూ కనువిందు చేయుట-
"ఎంత చిత్రం ఎంత చిత్రం"

# ఎగరవెయ్ ఎగరవెయ్

రచన, గానం: కీ.శే. జైసీతారాం, కోగిర, అనంతపురం జిల్లా.

సౌజన్యం: శ్రీ కె.సురేష్, రఘుబాబు.

ఎగరవెయ్ ఎగరవెయ్
ఏడు రంగుల జండా
అదే అదే మా జెండా
బాలల జెండా (2)

ఇంద్రధనసులో ఉండే ఏడురంగులే
జెండా నిండా కన్నుల పండగ జేసె
"ఎగరవెయ్ ఎగరవెయ్"

జెండా నడుమన ఉండే చందమామ
పండూ పండు వెన్నెల పంట సీమ
"ఎగరవెయ్ ఎగరవెయ్"

# కార్టూన్లు

చిత్రాలు: శ్రీవివియస్‌మూర్తిగారు, చొదిమెళ్ళ, పశ్చిమగోదావరి జిల్లా- 534002













అంత గట్టిగా
సెల్యూట్ చెయ్యక్కర్లేదయ్యా!!
VVSMURTY


ఇప్పుడు డాడీ పొట్టమీదెక్కి ఆడుకోకూడదమ్మా
రెండ్రోజులు పోయాక
ఆడుకుందువుగాని.....!!
VVSMURTY


నన్ను క్షమించండి!
ఏదో కోపంలో.....
VVSMURTY


నీకు ప్రమోషన్ ఇవ్వాలో
మా అబ్బాయికి LKG సీటు
ఇప్పించాలో తేల్చుకో!!
బాస్
VVSMURTY

# అమ్మకానికి తలలు!

*బొమ్మకు కథ రాయండి!*

*నిర్వహణ: శ్రీమతి జి.లలిత*, telugu4kids.com *చిత్రం: అనురాగ్ గోదావరి, 3 వ తరగతి.*



ఈ బొమ్మలో చూశారా?! తలలు లేని మనుషులు గుర్రాలెక్కి పోతున్నారు! తలలు అమ్ముకుంటున్నారు! మరి వాళ్ళకేమో తలలకు బదులు గుమ్మడికాయలున్నై! చూస్తే ఇదంతా ఏదో గందరగోళం అనిపించట్లేదూ? ఏదో అద్భుతమైన కథ ఒకటి మీ మనసును తట్టి కదిలిస్తోంది కదూ? ఆ కథను రాసి, మాకు పంపించండి. బాగుంటే కొత్తపల్లి పత్రిక జూన్2011 సంచికలో ప్రచురిస్తాం.

మా చిరునామా: కొత్తపల్లి బృందం, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515 101

# పదరంగం-2

*నిర్వహణ: దేవి, బెంగుళూరు.*

| 1 |  | 2 |  | 3 | 4 |
|---|---|---|---|---|---|
|  |  | 5 | 6 |  |  |
|  | 7 |  |  |  |  |
| 8 |  |  |  | 9 |  |
|  |  |  | 10 |  |  |
| 11 |  |  |  |  |  |

మీకు తెలుగు బాగా వచ్చా? ఇక్కడ ఇచ్చిన గళ్ళను సరైన తెలుగు అక్షరాలతో నింపండి. సరియైన పదాలను ఎంపిక చేసుకునేందుకు గాను ఆధారాలను జాగ్రత్తగా చూసుకోండి. బ్రాకెట్లలోని అంకెల ద్వారా పదంలో ఎన్ని అక్షరాలు ఉంటాయో తెలుస్తుంది.

## ఆధారాలు:

**నిలువు:**

1. స్వెట్టర్లు దీనితో తయారు చేస్తారు (2)
2. రోజు (2)
4. గంప నిండా, చాలా (3)
6. అందరికీ చెందినది- తిరగబడింది (4)
9. అడ్డం కాదు! (3))

**అడ్డం:**

1. తెలుగు సంవత్సరంలో మొదటి పండుగ (3)
3. అర్ధ భాగం (2)
5. నిలువు 2 తిరగబడి శివుని ముందు కూర్చుంది (2)
7. దోమలు మనల్ని కుట్టకుండా ఉండేందుకు కట్టేది (4)
8. సరి లేని సప్త స్వరాలు (5)
10. తడబడిన అంకెలు (3)
11. దసరా లో ఆనందపు గందరగోళం (3)

**వెల:**

ప్రతి ఒక్కింటికి: 20 రూ.

12 భాగాలు: 240 రూ.

“కొత్తపల్లి ట్రస్టు” పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.

బ్యాంకు అక్కౌంటు వివరాలు:
“Kottapalli Trust”,
A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోను: 08559 240222

ఇ-మెయిలు: team@kottapalli.in

**ఈ నెలలో ఏపని-ఎవరిది?**

ఆర్థిక వ్యవహారాలు, నిర్వహణ: సుబ్బరాజు

సంపాదకత్వం: నారాయణ

వెబ్సైటు, సమాచార సాంకేతికత: ఆనంద్

ముద్రణ: 'ముద్రిక' కృపాకరరావు

చిత్రాలు: వీరాంజనేయులు, అడవిరాముడు, శివరాంప్రసాద్, శివ, వాసు, అనిల్, చంద్రకాంత్, శంకర్, వై.రాజు.

కార్టూన్లు: 'విద్యార్థి' కృష్ణ, వివియస్ మూర్తి.

బొమ్మకు కథ: లలిత, telugu4kids

కథలు, పాటలు: చాలామంది పిల్లలు

**ప్రత్యేక కృతజ్ఞతలు:**

కార్టూన్ల వివియస్ మూర్తి గారికి, ప్రకృతి బడికి, టింబక్టు బడికి, అరవింద స్కూలుకు, విద్యార్థి సృజన కుటీరానికి, నందన గ్రామీణ పాఠశాలకు, వెంకటేశ్వర బాలకుటీరానికి, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.

ఇంటర్నెట్‌లో http://kottapalli.in వద్ద కొత్తపల్లి పత్రికను చదవండి.

అందరు పిల్లల కోసం మీరూ కథలు రాసి పంపండి.

చందాదారులుగా చేరి నెల నెలా కొత్తపల్లిని ఇంటికి తెప్పించుకోండి.

మీ మిత్రుల తరపున చందాలు కట్టండి.

మీకిష్టమైన బడులకు,గ్రంథాలయాలకు కొత్తపల్లిని బహూకరించండి.

# నా ముక్కు అందంగా ఉందా?

మూలం: జాక్‌ప్రెల్యుట్స్కీ　　　　　　　　తెలుగు అనువాదం: జివిజికె రాజు

నా ముక్కు అందంగా ఉందా? అద్దంలో చూసుకోనియ్యి. అయ్యో, ఇంకొంచెం సన్నగా ఉంటే బాగుండేది. అయ్యో, ఈ నా ముక్కు కొంచెం వంకరగా ఉన్నట్లుందే! అని బాధపడిపోతుంటారు కొందరు. మరి మీరు..?

నీ ముక్కు నీ ముఖానికే ఉన్నందుకు

తప్పనిసరిగా నువ్వు సంతోషించాలి

అదే ముక్కు ఇంకెక్కడైనా ఉంటే

నీకు తిప్పలు తప్పవని గుర్తించాలి

అందమైన నీ ముక్కు ముఖాన లేక

కాలివేళ్ళ మధ్య ఇరుక్కుని ఉంటే?

నీ పాదాల మట్టినీ, చెమట చెడ్డవాసననీ

పీల్చీ పీల్చీ నీ ముక్కు పూడిపోతుంది

వరహాల నీ ముక్కు కళ్ళ మధ్య కాక

నెత్తి పైకెక్కి జుట్టులో ఉంటే

వెంట్రుకలు తగిలి, కితకితలు పుట్టి

తుమ్మీ తుమ్మీ నీ ముక్కు ఊడిపోతుంది

కొనదేలిన నీ ముక్కు, పోనీ- నీ చెవిలో చేరితే?

జలుబు చేసి నువ్వు తుమ్మినప్పుడల్లా

ఆ గాలి విసురుకి, ఆ తుమ్ము తాకిడికీ

నీ మెదడంతా కదిలి పిచ్చెక్కిపోతుంది

అందుకే, ముచ్చటైన నీ ముక్కు

గడ్డానికీ చెవులకీ మధ్య చక్కగా

నీ ముఖాన్నే అమరి ఉన్నందుకు

తప్పనిసరిగా నువ్వు సంతోషించాలి!

Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP. Ph:08559 240222 E-mail: team@kottapalli.in and printed at Mudrica Offcet Printers, Vijayawada, Phone:08662579129

మంచి పుస్తకం:

## మంటల్లో హిరోషిమా

"ఆరోజునుంచి మాయి ఎదుగుదల ఆగిపోయింది. ఆమె ఇక పెరగలేదు. అది గడిచి ఎన్నో సంవత్సరాలు అయ్యింది. కానీ మాయి ఎత్తు, బరువు ఏడేళ్ళప్పుడు ఉన్నంతే ఉంది. "ఇదంతా ఆ అణుబాంబు కారణంగా జరిగింది" అన్నది అమ్మ నమ్మకం...

ఒక్కొక్కసారి మాయి తలలో బాగా దురద పుడుతుంది. అటువంటప్పుడు అమ్మ ఆమె జుట్టును వేరుచేసి, మెరుస్తున్న చిన్న వస్తువును చిమ్టీతో బయటికి తీసేది. విస్ఫోటనం సమయంలో మాయి శరీరంలోకి గుచ్చుకుపోయిన అద్దపు ముక్కలు అవి- మెల్లగా ఒక్కొక్కటీ చర్మంలోంచి బయటికి వస్తున్నాయి...

మాయి వాళ్ళ నాన్న శరీరంలో ఏడు గాయాలయ్యాయి. కొన్ని రోజులకి అవి తగ్గిపోయి పూర్తిగా నయమయ్యిందనుకున్నారు. కానీ విస్ఫోటనం తర్వాత ఆకులు రాలే కాలం వచ్చేసరికి అతని వంటిమీద జుట్టంతా రాలిపోయింది. అతను దగ్గుతూ రక్తం కక్కుకునేవాడు. అతని వంటిమీదంతా వంకాయరంగు మచ్చలు ఏర్పడ్డాయి. కొన్ని రోజులకు అతడు చనిపోయాడు...

దేవుడి దయవల్ల మనమంతా బ్రతికి బయటపడ్డాం అని చాలా మంది అనుకున్నారు. కానీ వీరిలో చాలామంది అణుబాంబు రోగాల బారిన పడ్డారు. ఇది 1945 లో జరిగింది- కానీఈనాటికీ కొంతమంది ఆసుపత్రుల్లో ఉన్నారు. ఈ రోగాలకు ఎటువంటి చికిత్సా లేదు..."

ఎన్నడో పేల్చిన రెండు అణుబాంబుల నీలి నీడల్లోంచి మానవ జాతి ఇంకా బయటికి రానే లేదు. సునామీలు "అయ్యో! ఈ అణువిద్యుత్‌కేంద్రాలు మానవ నిర్మితాలు కదా" అని వాటిని దయతో వదిలిపెడతాయని ఎవరికీ భరోసా ఇంకా కలగనే లేదు. "ఎందుకు, మనిషికి అణుశక్తిపట్ల ఇంత వ్యామోహం? ఇంత ప్రమాదకరమైన అణుశక్తితో ఆడుకోకపోతేనేమి? అణు బాంబు పేలగా చూశాం; చెర్నోబిల్ అణు రియాక్టరు ఏం చేసిందో చూశాం; ఇప్పుడు జపాన్ సునామీ కథనూచూశాం- వీటన్నిటినుండీ ఏదైనా నేర్చుకోవాలి గద? "- అనిపిస్తుంది, జనవిజ్ఞానవేదిక వారి ఈ ప్రచురణ చదివితే. అందరూ చదవాల్సిన పుస్తకం ఇది!

**మంటల్లో హిరోషిమా**

రచన: తోషీమారూకీ

ప్రచురణ: జనవిజ్ఞానవేదిక

వెల: 8 రూపాయలు.

